



# మురళీ మాధవము

లగడపాటి భాస్కర్, ఎం. ఏ., ఎం. ఇడి.

మురళీ మనోహరునిపై మలచిన

మధుర మనోజ్ఞ పద్యరూప

భావ చిత్రాలూ...

వివరణలూ...

# "MURALI MAADHAVAMU"

by

LAGADAPATI BHASKAR

*Published by* :
L. KIRANMAYI
For SASI KIRAN PUBLICATIONS
SRI KALAHASTI, CHITTOOR Dt., (A.P.)



*First Edition :*
*June 1982.*
*Copies : 1000.*



చిత్రకారుడు :
శ్రీదేవు దీక్షితులు (ఒంగోలు)

*Distributers :*

*President / Secretary*
Taluk Writers' and Artists' Association
5-20, M. G. Street, Sri Kalahasti,
Chittoor Dist., (A.P.) P. C. 517644.

వెల : రూ. 20/-

*Printers* :
WELDUN PRESS,
68, Mannappa Mudali St.,
MADRAS - 21.



THIS BOOK IS

PUBLISHED WITH THE

FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATHI DEVASTHANAMS

UNDER THEIR SCHEME

" AID TO PUBLISH RELIGIOUS BOOKS "

# కృతజ్ఞతలు . . .

మానవ జాతికి హితమైనదే మతమనీ, అది మానవులను వేరుచేసే మూఢ విశ్వాసం కాదనీ, రామాయణ, భారత, భాగవతాది గ్రంథాలు, నరజాతి సమస్తాన్నీ నైతిక పథంలో నడపగల బృహత్ కావ్యరూప నీతి సంపుటాలే కానీ, ఏదో ఒక మతానికి సంబంధించిన గ్రంథాలు కావనీ, విశ్వసించి, విశ్వశ్రేయస్సుకై, తద్విషయ సంబంధి రచనలను విస్తృతంగా ప్రోత్సహించడానికి, తిరుపతి, తిరుమల దేవ స్థానంవారు కంకణ బద్ధులయ్యారు. ఈ సత్కార్యాచరణ కార్యనిర్వ హణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. యస్., గారి నేతృత్వంలో నిర్విఘ్నంగా సాగుతున్నది. ఉదారంగా దేవస్థానం వారిచ్చిన భూరి విరాళమే ఈ గ్రంథం వెలుగుచూడటానికి కారణ భూతమైంది. కనుక ప్రథమంగా వారికి....

జీవిత భాగస్వామినిగానేకాక, ఈ రచనకు ప్రథమ శ్రోతగా, విమర్శకురాలిగా, వ్యవహరించి ప్రోత్సహించిన లగడపాటి శ్యామలాదేవికి

సుందరమైన ముఖపత్రమూ, అర్థవంతమైన రేఖా చిత్రాలతో గ్రంథాన్నలంకరించిన చిత్రకారుడు శ్రీ దేవు దీక్షితులు (ఒంగోలు) గారికి....

ఓర్పుతో ఈ పుస్తకానికి సుందర రూపాన్నిచ్చిన సహృద యులు, వెల్డన్ ముద్రణాలయాధికారులు, శ్రీ జి. భావనారాయణ, శ్రీ జి. మీరా ప్రభుగార్లకూ, వారి సిబ్బందికి....

రచయిత

కృతజ్ఞతలు !

# ఈ కృతి...

రాయలసీమ రచయితలకు కీర్తిగా, స్ఫూర్తిగా,
అరుణాచలేశ్వ రారాధనమే ఆశ్వాసంగా,
విశ్వాసంగా, జీవించిన సుకృతి! స్వర్గీయ
శ్రీ కె. సభాగారి ఆత్మీయతకు గుర్తుగా...



నాస్తిక భావముల్ విడచి
నమ్మిన ధోరణి క్రైతలల్లుచున్,
నేస్తము లాస్తిగా బ్రతికె
నిండు మనంబున చిత్త శుద్ధితో;
వాస్తవ మాతడే కదిపె
వర్ధిలు నా కల మప్పు డిప్పుడున్,
నిస్తుల మైన బంధమది!
నే–ముడివైతు 'సభా'ను, నీ కృతిన్!

# పారకుల కహా పద్యాల కహా మధ్య ...

మనలో చాలమంది మన పురాణాలు జరిగిన చరిత్రలా? లేక కవి కల్పనలా? అని ప్రశ్నిస్తూనే, ఆ పురాణ పాత్రలపట్ల అనురాగాన్నో, ద్వేషాన్నో మనసులో స్థిరపరచుకొని ఉంటారు. రాముని ద్వేషించేవారూ, రావణుని పూజించేవారూ - లోకంలో విడ్డూరమైన వ్యక్తులు! పురాణ కథలు మహర్షులు కాచివడబోసిన జీవిత సత్యాలు. మానవజాతి మనుగడకూ, విశ్వాసాలకూ, సంస్కృతీ సాంప్రదాయాలకూ, ఆలవాలాలు! నేటి జీవిత విధానానికి, రాజకీయ విధానాలకూ, న్యాయ, ధర్మ, శిక్షాస్మృతులకూ మూలకందాలు!

రాముడూ, కృష్ణుడూ, కల్పనా పురుషులనుకొన్నా, వారు సృష్టించబడిన కాలానికంటే ఇప్పటి వారిచేతనే వారు ఎక్కువగా పూజింపబడుతున్నారనేది సత్యం! అందునా శ్రీకృష్ణ భగవానుడు మానవుల్లో ఉత్తముడై పురుషోత్తముడయ్యాడు! దేవతల్లో దేవుడూ, మానవుల్లో మానవుడూ, రాజనీతి చతురుల్లో అసమానుడూ, యుద్ధ విద్యల్లో, ఆయుధ ప్రయోగంలో, రథచోదకత్వంలో, వ్యూహ నిర్మాణంలో, - ఒక్కటేమిటి? అన్నిటా అధికుడై జరాసంధ, శిశుపాలాది మహాబలసంపన్నులకుగూడ గుండె గాలమయ్యాడు.

పుట్టుకనుంచీ మహిమలు చూపడం, మునులూ, దేవతలూ ద్వారకకూ, మథురకూవచ్చి చూచిపోవడం, ఆతడున్నచోటు యాత్రాస్థలమేకాక, త్రిలోకపాలనా వ్యాపారాలకు కేంద్ర స్థానమైన రాజ

ధాని కావడం, ఏ పురాణం పరిశీలించినా మనకు వ్యక్తమౌతుంది. ఆతడు నాయకుల్లో సరస శృంగార, దక్షిణ నాయకాగ్ర గణ్యుడు! గీతను బోధించి అర్జునుడికేగాదు జగత్ప్రవక్త అయ్యాడు! స్నేహ బాంధవ్యాలకు పరమావధిగాను, యోగిజనులకూ, గోపికా హృదు లకూ ఒకే విధంగా ఆకర్షణీయుడైన వ్యక్తిగాను ప్రసిద్ధి పొందాడు!

ఆయన గాథలో ఉన్న మాధుర్యం! వైవిధ్యం!-కవులకూ, కల్పనా ప్రియులకూ, యితరత్రా కానరాదు. అందుచేత ఆ పర మాత్ముని గూర్చి చెప్పే ఏ మాటైనా అమృతోపమానంగా చవు లూరిస్తూ, సర్వకాలీనమూ, సర్వజనీనమూ అయివుంటుంది! గీతను బోధించడంలో ప్రశ్నోత్తర రూపంగా నెరపిన ఆచార్యకత్వమూ, రాయబారంలో ప్రదర్శించిన వాఙ్నైపుణ్యమూ, విశ్వసాహిత్యంలో ఉన్నతోన్నత స్థానాన నిలుస్తాయి!

ఆ - రసికజన మనోహరుని, రమణీయ కల్పనా విగ్రహుని. భావ చిత్రాలను కొన్నింటిని నా యీ చిన్న గ్రంథంలో పద్య కుసు మాలలో పొదివి సహృదయ పాఠకోత్తములకు సమర్పించే ప్రయత్నం చేశాను. సామాన్య పాఠకులకు అనుకూలంగా క్లుప్తంగా భావ వివ రణలు క్రిందనే పొందుపరచాను.

ఐహిక వాంఛలతో, ప్రలోభాల మైకంలో కొట్టుకుపోతున్న నేటి నవనాగరిక మానవుడు – ఆతడు వాంఛించే అనేకమైన రుచుల నుంచే, భగవంతుని గూర్చి ఆలోచింపజేయడానికీ, పారమార్థిక ప్రయోజనాలను గూర్చి అంచనాలు వేసుకోవడానికీ, ఈ పద్యాలు కొంతవరకు ఉపయోగిస్తాయని ఆశిస్తున్నాను. ఇది ఖండ కావ్యమూ కాదు. అఖండ కావ్యము అంతకంటే కాదు. శ్రీ కృష్ణావతార తత్త్వాన్ని గూర్చిన చిన్న సమీక్షలాంటిది మాత్రమే! ఇందులో విషయం మధురమైంది. ఛందస్సుకూడ సరసమైన ఉత్పలాలూ,

చవులూరించే చంపకాలూను. అయితే అందులో నాపదాల, భావాల, కూర్పు నేర్పు మధురంగా ఉందో, లేదో, రసికుల, సహృదయుల నిర్ణయానికి వదులుతూ, పాఠకులు పరమహంసలై, క్షీర నీర న్యాయంగా కలసివున్న గుణదోషాలలో, గుణక్షీరాన్నే గ్రహించి, ఆ - బాలగోపాలుని అనుగ్రహానికి పాత్రులు కావాలని కాంక్షించే,

మీవాడు—

లగడపాటి భాస్కర్.

శ్రీకాళహస్తి,
జ్యేష్ఠ, దుందుభి.





కడువడి పర్వులెత్తుటను కాంచి కటిన్ దిగజార తీపిరా....

(పుట-205)

వల్లవీకుల గిరులను
ప్రాలి, క్రాలి;
నీలమేఘాల మెఱుగుల
నింగి దాకి,
నిలచు శిఖరమ్మె యగు కృష్ణ!
నీ చరిత్ర!
తెలిసి కొలుచుట యెటు? వసు
దేవపుత్ర! 1

కృష్ణా!

గోకులమనే కులపర్వత శిఖరాలు శాశ్వతత్వాన్నీ, ఔన్నత్యాన్నీ తెలిపేటట్టు మేఘమండల పర్యంతం ఎదిగి వున్నవి! నీవా పర్వత పంక్తిపై నల్లమబ్బులా వ్యాపించి తాపాన్ని పోగొట్టుతూ, ఆ గోకుల చరిత్రలో అత్యున్నత స్థాయినందుకొన్నవాడ వైనందుకు గుర్తుగా ఉన్నతోన్నత శిఖరమై భాసిస్తున్నావు! అట్టి నీ వృత్తాంతాన్ని చక్కగా అవగాహన చేసికొని నిన్నారాధించట మేలాగు?

పుట్టిన నాటినుండియు, న
పూర్వమహత్వము లెన్నియేని నీ
చుట్టును నల్లినారు, నిను
శూరుడు, మారుడు, బ్రహ్మచారియం
చిట్టటు లేనిపోని కథ
లెందరొ వ్రాయుచు పోయినారు, నే
డెట్టుల కృష్ణ! నీ నిజము
నెల్లరు మెచ్చగ చెప్పబూనుటల్ ? 2

కృష్ణా!

నీవు పుట్టినప్పటినుండి అపూర్వ మహిమలను ప్రపంచానికి చూపినట్టు, నిన్ను గూర్చి కథలల్లినారు. నిన్ను పరాక్రమవంతులలో పరాక్రమునిగా, అందగాళ్ళలో అందగానిగా, అందరతివలున్న వాడివైనా బ్రహ్మచారిగా, ఏవేవో వృత్తాంతాలు ఎందరెందరో వ్రాస్తూపోయారు. అలాంటి కథలు విననలవాటు పడ్డ యీ లోకానికి మెప్పుగలిగేటట్లు మరల నీ కథను చెప్పబూనడం ఎలా?

ఎటు పాడంగలఁ భక్త మీరవలె నీ
కిష్టంబుగా గీతముల్ ?
ఎటు చేయన్ జయదేవ సూరకవు ల
ట్లింతైన నీ వర్ణనల్ ?
ఎటు నే గూర్తు ? పురంధరుంబలెను, నీ
కింపైన వౌ కీర్తనల్ ?
ఎటు వేడంగల నిన్ ? పదంబులకు నే
నెక్కించి క్షేత్రజ్ఞుడై ? ! 3

స్వామీ !

భక్తురాలైన మీరాభాయి కమ్మనిభావాలతో, మరింత కమ్మని కంఠంతో నిన్ను మృదుగీతాలతో కీర్తించినట్లు, నీకిష్టమైన గీతాలల్లి నేను పాడి రక్తి కట్టించలేను. జయదేవ కవిలాగ సూరదాసులాగ నిన్ను వర్ణించే శక్తి నాకు లేదు. పురంధర దాసునిలాగ నీకిష్టమైన రీతిలో కీర్తనలు వ్రాసి వాసి గాంచలేను. క్షేత్రయ్య వలె నిన్ను పదసాహిత్య ప్రకాశితునిగా చేసి స్తుతించలేను సుమా !

గోపాలా ! యదుబాల ! మా రమణ ! హే
గోవింద ! బృందారతా !
రూపాతీత ! విరాట్స్వరూప ! కన నీ
రూపమ్మెదో మోహనా !
ఈ పాపంబుల పంటబెట్టు జగతిన్
ఎట్లుందువో మాకు నై ?
మా పాలన్ కరమొప్పు బాలకుడవై
మా కన్నడై యొప్పుమా ! 4

గోపాలా !

యాదవ బాలకా ! లక్ష్మీ రమణా ! గోవిందా ! బృందావన వినోదా ! నిర్ణయింపరాని రూపు గలవాడా ! విశ్వమంతటా వెలసిన బృహాత్ స్వరూపా ! మోహనాకారా ! అసలు నీ నిజ రూప మేది ? ఈ పాపాలను పెంపొందిస్తున్న లోకంలో మా కొరకు నీవు ఏ రూపంలో ఉండ గలవు ? నాకు నీ వెప్పుడూ బాలకృష్ణుని రూపం లోనే దర్శన మివ్వు స్వామీ !

బాలుడవై పరుండి, ముఖ
పద్మమునందు పదార వింధముఁ
పాలను గ్రోలు రీతినిడి,
పన్నగశాయి! యశోదయూయెలఁ
జోలకు నిద్రలోన పడి,
సంత విరామము లోన లేచి, నీ
లీలల నీవె మెచ్చుటలు
లేవుర చూడ జగాన నెచ్చటఁ! 5

ఓ పన్నగశయనా!

నీ లీలలు పలురకాలు. యశోదమ్మ ఊయెలలో సామాన్యమైన బాలునివిగా పరుండి ముఖ పద్మములలోనికి పాద పద్మాన్ని తీసుకొని పాలు త్రాగే పిల్లవానిలా కాలివ్రేలిని చీకుతూ, అంతలో యశోదమ్మ జోలపాడగా నిద్రలోనికి జారుకొని, ఒక్క క్షణంలో మరల మేల్కొని నీలో నీవే నవ్వుకొంటుండటం చూస్తే, ఈ లోకాన్ని నీవు నడిపించే తీరును తలచుకొని నీలో నీవు నవ్వుతున్నట్లుగా వుంటుంది. ఇలాంటి శైశవ క్రీడలు లోకంలో మరొక చోట చూడలేము సుమా!

బాలుడవేన! బువ్వతిన
వల్లనుకాద? యశోద నీకుగా
పాలను గల్పి పళ్ళెమున
వాసిగ నుంచిన యన్నమంతయుఁ,
బేలగ బుల్లిచేతులను
పిండుచు, బొక్కుచు రాల్తు నేలపై,
కోలమవౌచు నీ ధరనె
కోరను నెత్తిన బల్మియేదిరా? 6

గోపాల బాలా!

నీవు నిజముగా బాలుడవా! బువ్వతిననైన చేత గాని వాడివా? యశోదమ్మ నీకోసం పళ్లెరంలో పాలబువ్వను కలిపి యుంచగా, ఆ మెతుకులను నీ బుల్లిచేతులతో పిండుతూ, కొన్ని మెతుకులు నోటిలోనికి కుక్కికొని, కొన్ని మ్రింగుతూ, కొన్నిటిని నేల రాలుస్తున్నావా? ఎందుకు? నీకు ఆ మెతుకులే బరువయ్యాయా? వరాహావతారంలో ఈ భూమినంతా ఒక్క కోరతో గ్రుచ్చి యెత్తినప్పటి నీ బలిమి ఇప్పుడేమైనది?

కారను నూయలూగు నిను
  గన్గొన వచ్చిరి దేవతోత్తముల్,
సారతరంపు సంస్తుతుల
  సన్మునులౌ సనకాదు లుండగా
కూరిమి శైశవంబునను
  కూర్కిన రీతిని యొప్పినాడవే!
తీరులవెన్నొ కృష్ణ! విను
  తించెడు భక్తుల కిచ్చు రూపులో! 7

కృష్ణా!

నీవు కారాగారంలో పుట్టినప్పుడు ఊయెలలో వేసి ఊచడానికి దేవతలూ, సనకస నందనాదులూ ఎందరో రాగా, వారి స్తుతులు విని సాధారణ శిశువు నిద్రమత్తులో ఉన్నట్టు నటించావు! అదికూడా ఆ భక్తులకు పరమ ప్రసాదమే! ఎందుకనగా నీవు నిన్నుకోరే భక్తులకు దర్శనమిచ్చే రూపు ఇది' అని స్థిరంగా చెప్పలేము గదా! ఎన్నో రూపాలలో అగుపించే నీలీలలలో- ఇదీ వొక్కటి!

నీ కుటిలంపు భ్రూకుటియు,
నీ నగుమోమును, కొంటె చూపులుజ్,
నీ కుటజంపు నాసికయు,
నిద్దపు టద్దము బోలు చెక్కిళుల్,
మాకు వరంబు లిచ్చి, దయ
మాపయి జూపిన యట్లుదోచు! నీ
లోకమె యూచు మస్తకము
లోలము లౌయధరాలు జూచుచున్! 8

మోహనా!

నీ ముడిచిన కనుబొమల తీరూ, నీ నగుమోము సొరూ, నీ కొంటెచూపుల చురుకూ, కుటజ కుసుమంలాంటి ఆ ముక్కూ, అద్దాలవంటి చెక్కిళ్లూ, చూస్తూండగా—అవన్నీ మాకు వరాలిచ్చి పాలిస్తున్నట్లు తోస్తున్నవి! నీవు పెదవులు కదిపితే ఈ లోకాలే తలలూస్తూ తన్మయమౌతున్నాయి! (పరమాత్ముని పెదవుల కదలికలు ఈ లోక వ్యాపారానికి ఆజ్ఞలు కావటంవల్ల—అవి విధేయంగా తలలూస్తున్నవి! అందాలన్నీ భగవత్స్వరూపాలు కావడంవల్ల అవి మానవుల పాలిట వరాలౌతున్నవి!)

నల్లని పింజమేఘమయి
నాట్యము సల్పుచు గొల్లవాడలో
పెల్లుగ పాలు, చల్లలను
పిల్చిన బర్వున ప్రేమ వృష్టిని౯
జల్లుగ జల్ల, మించులగు
చానల మేనులు జల్వడంకె. నా
పల్లెను లేమిలేదు, యదు
బాలుడె పాడియు పంటవారికి౯. 9

గోపాలకృష్ణుడు—

నల్లని మబ్బు తునకలా గొల్ల వాడలలో నాట్యం చేస్తూ, పాలనూ, మజ్జిగనూ తుష్టిగా పీల్చి బరువెక్కి, ఆ వాడమీదనే ప్రేమవర్షాన్ని కురిపించగా, మెరుపు తీగలాంటి స్త్రీల శరీరాలు (తమకంతో) మిక్కిలి వణకి పోయాయి! కనుక వ్రేపల్లెలో నిక కఱవు లేదు. ఆ కృష్ణుడే వారికి పాడీ-పంటా-కూడా!

కన్నుల చెన్ను, మిన్నువలె
    గ్రాలెడు కాయపు సోయగంబునన్,
వన్నెల మౌళి పింఛమును
    వంశి ధరించిన పాణియుగ్మమున్,
సన్నని మధ్యమున్, నడల
    సామజ ధీరము చూచి మెప్పుగా,
కన్నెలు దాచికొందురటె!
    కాటుక పిట్టల బోలు కన్నులన్! 10

గోపాలా!

నీ కన్నుల చెలువమూ, మిన్నులా మిసలు గొలిపే నీ శరీర సౌందర్యమూ, మురళిదాల్చి మురిపాలుచిందే నీ చేతులూ, సన్ననినడుముతో మదగజంలా నడిచే నీ నడకా, చూచిన కన్నెలు– నీ రూపాన్ని తమ కాటుక పిట్టల్లాంటి కన్నులలో దాచుకొంటారట గదా?!

మోహన వంశి హస్తముల
  ముద్దుగ దాలిచి, యొరపాదమై
దేహము మూడు వంపులుగ,
  తీరుగ నిల్చిన వేణుమాధవున్
ఊహకు దెచ్చి ప్రేతలటు
  లుండిరి వేణువు నూదుభంగితో;
మోహము తాపమున్ దొలగ
  ముగ్ధలు ప్రేమికు లీల జూపరే! 11

ఆ వేణుమాధవుడు

పరవశింపజేసే మురళీ వాయిద్యాన్ని తనచేతులతో మనోహరంగా పట్టుకొని, ఒక పాదం ఏటావాలుగా పెట్టుకొని, దేహాన్ని మూడు వంపులు తిరిగిన భంగిమలో నిలిపి ఎలా వుంటాడో! ఆ స్వరూపా న్నొకసారి ఊహకు తెచ్చుకొన్న గోపికలు, తాముకూడ వేణువు నూదే ఆ గోపాలుని భంగిమను అభినయిస్తూ నిలచుకొన్నారు. ప్రియునిగూర్చిన తలంపులు ముగ్ధలను పెనగొన్నప్పుడు, ఏకాంతంలో ప్రియుని లీలలను అభినయించి తాపాన్ని తగ్గించుకోవడం, ఊరట పొందడం ఒక పద్ధతిగదా!

గొల్లల వాడలో పెరుగు
  గ్రోలితి వంటనె కన్నుమూసి, యో
అల్లరి పిల్లడా! యొకతె
  కర్మిలి మూతికి వెన్నబూసి, యా
పిల్లను నత్తగొట్టి, కడు
  పెద్దవు వోలెను నడ్డమేగితా?
చెల్లవు బాలకా! యిటుల
  చిల్లరి చేతలు చేయరాదురా! 12

ఓయీ! బాలగోపాలా!

గొల్లపల్లెలో ఎందరి యిళ్లలోనో ఏమరిచి పెరుగు త్రాగితివటగదా!? ఓయీ! అల్లరివాడా! వెన్నలు దొంగిలి తిని దారినిబోక ఆ యింటి కోడలి మూతికి కొంత పూసి పోగా, ఆయత్త తన కోడలే మెక్కెనని కొట్టబోగా, పెద్ద మని షివిలాగ ఆమెకు అడ్డు పోయితి వటగదా? తగునా ఇలాంటి యల్లరి చిల్లరి పనులు? ఇట్టివి నీలాంటి వారు చేయరాదు సుమా!

గోకుల మంతనిన్ను కడు
కొంటె వటంచును వచ్చి చెప్ప, నీ
రాకను జూచు చుండి యొక
త్రాటను ఱోటికి గట్టి తాను, నీ
పోకిరి చేతలన్నుడుప
బోయెను పాపము పిచ్చితల్లి! యా
మ్రాకుల గూల్చునట్టి యస
మానుడ వీవని నేర్వదమ్మ ము≡! 13

యశోద నందనా!

గోకులమంతా నిన్నుగూర్చి, నీ కొంటెపనులను గూర్చి వచ్చి చెప్పగా, నీ తల్లి నీ రాకకోసం ఎదురుచూచి, నీవు రాగానే ఒక త్రాటితో రోటికి గట్టివేసి నీ దుడుకు చేతలను అరికట్ట దలచుకొన్నది పాపం! కాని, ఆ రోటిని దొర్లించుకొంటూ పోయి సాలవృక్షాలనే పడగొట్ట గల అసమాన బాలుడవని ఆ యమ్మకు తెలియదు గదా!

పాల సముద్రమందునను
పాపడవై నిదురించు నీకు, గో
పాలక ! జోలపాడ తన
పాపడ వేనని నా యశోద తా
'లాలిజో ! రామలాలి' యన;
'లక్ష్మణ! వింటిని దెమ్ము నాకు, నే
కోలను గూల్తు రాక్షసుల !
గూల్చెద లంక'ని పల్వరింపవే ! 14

గోపబాలకా !

ప్రళయాంతంలో పాలసముద్రం మీాద పసి పాపలా యోగనిద్రను నటించే నీవు–యశోదమ్మ ఊయెలలో బాలుడవై ఊగతున్న సమయాన, ఆ తల్లి "రామలాలీ!" అని జోకొట్టుతూ— అందరి తల్లుల లాగే నీలో రామత్వాన్ని ఆరోపించి పాట పాడగా, ఒక్క–క్షణం నిద్ర జోగిన నీవు రామావతారం స్మృతికి రాగా, లంకలో మూర్ఛ దేరి లక్ష్మణునితో అన్నట్టుగానే, "లక్ష్మణా! వింటినందుకో! ఈ రాక్షసులనూ, లంకనూ, కూల్చి వేస్తాను" అని పలవరించావటగదా !

కడుపున లోకముల్ దిరుగ
కన్నుల వెల్గ దివంబు రాత్రముఙ్ !
నడువగ రాని వానివలె
నందకిశోరమ ! నాల్గు కాళ్లతో
కడువడి దోగి యాటలను
కన్నయశోదకు చూపుచుంటివా ?
కడుపున గోళముల్ కదలు
కన్నయ! మిన్నక నాడబోకుమా ! 15

ఓ నందనందనా!

నీ యుదరంలో విశ్వగోళాలన్నీ తిరుగుతుండగా, సూర్య చంద్రుల రూపంలో నీ కళ్ళయందు పవలూ రేలూ ఒప్పుతుండగా, నడకలు రాని వానివలె నాల్గు కాళ్ళ దోగాటతో మీ యమ్మ యశోదను సంతోష పెట్టడానికి గుణగుణ తిరుగుతున్నావా ? ఓ చిన్ని కన్నయ్యా! బాధ్యత మరచి ఊరక ఆడవద్దు! నీ కడుపులోని లోకాలు నీవు ఎక్కువ కదలితే తల్లక్రిందులై పోగలవు సుమా!

అందము లౌనె బేడిసలు ?
అంగజుగన్న వరాల తండ్రికిన్
ఎందుకు తామరల్ శశియు ?
ఏలనో తుమ్మెద పిండుజూడగా,
వందలొ ! వే మడుంగులనొ !
వన్నెలు చిందెడి నీదు మోములో
పొందునె పోలికల్ ? కవికి
పోల్పగ వస్తువు లున్నె మాధవా ! 16

మాధవా!

నీవు మన్మథుని కన్న తండ్రివి! అందాలలో అతనికన్న మిన్నవు! నిన్ను వర్ణించడానికి కవి యే ఉపమానం తీసుకున్నా వ్యర్థమే. ఎందుకనగా నీ కన్నుల సౌందర్యాన్ని మించ లేవు బేడిసలు. ముఖాన్ని పద్మంగానో, చంద్రుని గానో చెప్పడం పరిహాసాస్పదం. ముంగురులను తుమ్మెద బారుగా వర్ణించడం, వాటి అందాన్ని కించపరచడమే! కవులు సామాన్యుల అందాలను వర్ణించడానికి తీసుకొనే ఉపమానాలతో నే నిన్ను వర్ణించి చెప్పబూనటం సాధ్యం కానిపని. ఉపమాన వస్తువులకంటె, వందల, వేల గుణిత మైన నీ—సోయగాన్ని గూర్చి చెప్పడానికసలు ఉపమానాలెక్కడున్నాయని ?

పెరుగును ద్రచ్చు చుండు నెడ
వెన్నకు వచ్చియు తొంగి చూడగా,
వరకుముదంబు బోలు ఘన
వక్త్రము నిండిన చల్ల చిన్కులన్,
మురిపెము గూర్చు నీ ముఖము
ముచ్చటగా కనుపట్టె మింటిలో
బరగెడు పూర్ణ చంద్రుడన
భద్ర ముఖాంబుజ ! గోపబాలకా ! 17

ఓ మంగళమూర్తి!

గోపాల బాలకా!

పెరుగును చిలుకుతున్న సమయాన వెన్న కోసమని వచ్చి కుండపైకి తొంగి చూస్తున్న నల్లకలువ లాంటి నీ ముఖం మీదికి ఎగిరి పడి అంటుకొన్న మజ్జిగ చినుకులతో, చూడ ముచ్చట గొలిపే నీ సుందర వదనం, ఆకాశాన చుక్కల మధ్య ప్రకాశించే పున్నమ చంద్రునిలా భాసిస్తున్నది సుమా!

పాల సముద్ర మందునను
    భాసుర లక్ష్మికి తోడబుట్టుగా
దేలిన చంద్రుడే విధిని
    దేజరిలున్ దిపి తార కాళితో,
బాలుడు, గోప బాలుడగు
    వంశి ధరుండు, ముఖాన చల్లలున్
రాలిన బాష్పబిందువుల
    రమ్య తరంబుగ నొప్పె నట్టులే! 18

ఆ గోపాల బాలుడు!

వంశీ కృష్ణుడు! ముఖం నిండా చల్ల చినుకులూ, కన్నుల నిండా ఆనంద బాష్పాలూ కలిగి ఎలా ప్రకాశిస్తున్నాడనగా, పూర్వం పాలసముద్రంలో లక్ష్మీదేవికి తోడ బుట్టువుగా బుట్టి, మింటికెగసిన చంద్రుడు, తనచుట్టూ వున్న మిలమిల లాడే తారకాళితో తేజరిల్లుతున్న విధంగా ఉన్నాడు!

నీ యధరంబు ల్గొప్పునొక
నీల తమాలము నందు బింబమై,
నీ యపు రూపమౌ కనుల
నీరజముల్ కుముదాలు విచ్చు, నీ
తీయని నవ్వులో సొబగు
దీప్తులనే ధరియించు చంద్రుడుఀ,
నీ యరుణాంఘ్రి సోకి ధర
నిత్య సుదర్శన యౌను మాధవా! 19

మాధవా!

నీ పెదవులు తమాల వృక్షంలోని దొండపండ్లు లాగ కనిపిస్తున్నాయి! నీ యసాధారణ మైన, సూర్యచంద్ర రూపమైన కన్నుల కాంతుల చేతనే పద్మాలూ, కలువలూ, వికసిస్తున్నవి! నీవు తీయగా నవ్విన నవ్వులోని అందాలే చంద్రుడు ధరించి కాంతి మంతు డైనాడు! నీ యరుణ కాంతులు విరజిమ్మే పాదాలు సోకడం వల్లనే ఈ భూదేవి చూడటాని కింత సుంద రంగా, నిత్య వసంత శోభలతో అలరారు తున్నది!

నీచిరు నవ్వు సౌరు కవి
నేర్చునె వర్ణన సేయ? భూమిపై
చూచిన, యూహ చేసిన, వి
శుద్ధములౌ కవిలోక వస్తువుల్,
ఏ చవి రావు, నీ చవికి
నెట్లును బోలవు, కాన వర్ణనల్
తోచిన రీతి చేయుదురు
తొంటి విధాన జగాన మాధవా! 20

మాధవా!

ఏ కవియైనా నీ చిరునవ్వు సొగసు ఇలా వుంటుందని సరిగా వర్ణించి చెప్పగలడా? ఈ లోకంలో చూచినవీ, ఊహించినవీ, ఉత్తమోత్తమమైనవీ, కవిలోక ప్రసిద్ధమైనవీ అయిన ఉపమాన వస్తువులన్నీ నీ మధుర మనోహర రూపానికి పోల్చదగనివీ, దీటురానివీ, అయివున్నాయి! కావున, ఈ కవులు తమకు తోచిన రీతిగా, లోకంలో అందరూ చూసే రీతిగా వర్ణించుకొంటూ వస్తున్నారంతే!

పూతన పీడి ప్రాణముల
భూధర మట్టుల నేల గూలగా,
ఆ తనువున్ గుఠారముల
నంతట ముక్కలుజేసి కాల్పగా,
ప్రీతి సుగంధ ధూమములు
పెల్లుగ వెల్వడె నంమనుండి; యా
ఘాతిని పూత యమ్యె గద
కన్నయ! నిన్నొడి జేర్చి నంతనే! 21

ఓయీ! కన్నడూ!

పూతన పాలుద్రావి నీవు ప్రాణాలు తీయగా ఆరక్కసి నిజరూపంతో ఒక మహా పర్వతం లా నేల కూలినదట! నందుని పరివారం ఆ శవాన్ని గొడ్డళ్ళతో ముక్కలు చేసి బండ్లపై తరలించి కాల్పించగా, అందు లోనుండి అగరు పరిమళాలు వెలువడ్డాయట! బాల ఘాతిని యైన పాపాత్ము రాలు గూడ నిన్నొడిజేర్చి పాలిచ్చి నందువల్ల పవిత్రు రాలైనది కాబోలు! అలా కానిచో శవధూమంలో అగరు పరిమళా లేలా రాగలవు?

బలిసుత రత్నమాల నిను
బాలుని గా గని, పాలుచేపగా,
వలగొన పుత్ర భావమున,
'వచ్చెడు నొక్క భవంబు నందు నీ
తలపును దీర్తు, ముక్తి నిడి
ధన్య నొనర్తు' నటంచు బల్కుటన్,
కలిగెను కృష్ణ! పూతనకు
కామిత సిద్ధిటు లీ భవంబునన్! 22

కృష్ణా!

వామనావతారంలో నీవు ముద్దులొలికే వడుగువుగా మారి బలిని దానం కోరడానికి వెళ్ళినపుడు, ఆతని కూతురు రత్నమాల నిన్ను చూచి మాతృభావంతో స్తన్యం పొంగగా పాలివ్వ దలచినదట! ఆమె మనోభిలాష కనిపెట్టిన నీవు ఆ కోర్కె మరొక్క జన్మలో తీర్చ గలనని చెప్పి, ఈ జన్మలో పూతన గావచ్చిన ఆవిడనిలా స్తన్య మివ్వనిచ్చి పూర్వపు కోర్కెదీర్చి ధన్యురాలినిగా చేశావు గదా!

పిల్లడివౌచు తల్లి యొడి
ప్రేముడి గూర్చుచు నున్న నీవు నో
గొల్లలతేడ! గాలివలె
గొంచును పోవగ వచ్చు రక్కసుఁ
డుల్లగనేయ, వేగయి క
డుంగడు మోయగరావు తల్లికిఁ;
పెల్లున వాని గూల్పగనె
పెన్బరు వెచ్చటి కేగె జెప్పుమా! 23

ఓయీ! గొల్లలదొరా!

నీవు పసిపిల్లడివై తల్లి ఒడిలో కూర్చొని పుత్ర ప్రేమను ఆమెకు తలమున్కలుగా అందిస్తున్న సమయాన, నిన్ను కొనిపోయి హతమార్చ డానికి వస్తున్న తృణావర్తుడనే రాక్షసునికి మోయరాని భారం కావడానికేనేమో! ఉన్న ట్టుండి తల్లికి పర్వత శిఖరంలా మోయరాని బరువైనావు! అప్పుడామె క్రిందికి దింపగానే సుడిగాలిలా వచ్చిన రక్కసునితో ఆకాశాని కెగసి, వానినిచంపి క్రిందికి దిగివచ్చి యథా పూర్వకంగా తేలికగానే ఉన్నావట! అంత లోనే అంత బరువెచ్చటికి పోయెనో గదా?

పాపము పాండు రాజునకు
పత్నుల కామన కన్ను గప్పగా,
కోపము జెంది దుర్వాసుడు
ఘోరముగా శపియింప, రక్కసై,
పాపడవైన నిన్ను సుడి
వాటపు గాలిగ గొంచుపోయె, తా
శాపము బాపు దైవమని
చక్క నెఱుంగును కృష్ణ! పాండు రుఙ. 24

కృష్ణా!

పాండురాజు పూర్వజన్మలో భార్యామోహా పాశబద్ధుడై రేవనదీతీరంలో వారితో విహారిస్తూ వందనీయుడైన దుర్వాసుని ఉపేక్షించి నందు వల్ల ఆ కోపిష్టి రాక్షసుడవు కమ్మని శపింపగా ఆతడే తృణావర్తుడయ్యాడట! శాపముక్తి నీ వల్లనే ఉన్నదని తెలిసినవాడు కనుక, నీ చేత మర్దింపబడి ముక్తుడు కావడానికి ఉవ్విళ్ళూరి నిన్నతడు అలా సుడిగాలిలా పైకి తీసుకు పోయాడు సుమా!

ఇంటను క్షీర భాండముల
నిట్టటు జేసిన నీకు శిక్షగా
వెంటను బర్వులెత్తి నిను
వీకను బట్టియు గట్ట బోవగా,
గంటుగ మోమువెట్టి యటు
గన్న యశోదకు నబ్బురంబుగా
నుంటివి, యెన్ని త్రాళ్ళకును
నించుక యందక నందబాలకా! 25

ఓ నందకుమారా!

యశోదమ్మకు నీవు వాత్సల్యామృతాన్ని పంచి ఇచ్చే క్రీడలో ఒకనాడు యింటిలోని పాల కుండను పాడుచేసినందుకు నిన్ను శిక్షింప దలచిన ఆ తల్లి నిన్ను తరిమి పట్టుకొని, ఒక స్తంభానికి కట్టివేయ ప్రయత్నింపగా, కోపంతో నీవు ముఖంముడుచుకొని—ఎలా కట్టగలవో కట్టు అన్నట్టు—ఎన్ని దారాలు తెచ్చి ముడిపెట్టి కట్ట బోయినా కొంచెము కట్టడానికి చాలనట్టు చేశావట! విశ్వవ్యాపివి! విశ్వరూపుడవు! నిన్ను బంధింప సాధ్యమా?

చాన యొకర్తు క్షీరముల
 జక్కగ గాచియు, గండశర్కరల్
తేనెయు నేలకల్ గలిపి
 తీయని తాయము జేసి దానినిన్
బానను దాచి మూతనిడి
 బాలు రెరుంగక యుట్టి నుంచగా,
ఓ నవనీత చోర! తిన
 నొప్పున నొడ్డుల సొమ్ము తేరగా! 26

ఓ వెన్నదొంగా!

ఒకానొక గొల్లపడుచు పాలను చక్కగా కాచి, అందులో చక్కెర, ఏలకలు, తేనె మొదలైన రసోచిత పదార్థాలు కలిపి, కమ్మని తాయమొక దానిని చేసి, బానలో దాచి పిల్లలకు తెలియకుండగ మూతపెట్టి ఉట్టిమీదనుంచి యుండగా, నీవు పరులసొమ్ము ఊరక వస్తుందని తిని రావచ్చునా?

క్కరల్

నిన్

ంచగా,

గా! 26

క్కగా కాచి,
మొదలైన
తాయమొక
కు తెలియ
యుండగా,
ందని తిని.



"పాలను గ్రోలినం గురులు
బాగుగ వచ్చునటంచు జెప్ప, నే
నాలను నిల్పి గ్రోలితిని,
యంగనలం గనుమూసి త్రావితిన్,
ఏలను తల్లి! యీ కురులో
కింతయు పెద్దవి కావు నాక''నన్
బాలుని బేలవాక్కులకు
ఫక్కున నవ్వెను నా యశోదయున్! 27

'పాలు ఎక్కువగా త్రాగితే శిరోజాలు చక్కగా మెదుగుతాయని చెప్పుకోవడంవిని— నేను ఆవులను నిల్పి నేరుగా పాలుత్రాగాను! గొల్లవాడలో అంగనాజనాన్ని కన్నుగప్పి త్రాగాను. కాని, ఈ కెంద్రుకలు ఎప్పటిలాగే వున్నాయి. కొంచమైనా పెరగ వెందుకమ్మా?' అని గోపాలబాలుడు అమాయకంగా యశోదమ్మ నడుగగా, ఆ బాలుని బేల తనానికి తల్లి ఫక్కున నవ్వింది!

చెవులను గుట్టుచో ముఖము
   చింతగ దోప, యశోద, నందుడుఁ
తవ సుకుమారమౌ చెవుల
   తమ్మెలు నొచ్చు నటంచు భీతిగా
తవిలిన పుత్రరాగమున
   తత్తర పెట్టగ స్వర్ణకారునిఁ
అవని విమోహమందు గతి
   నంతట నవ్వితె కృష్ణ! తల్లికై! 28

కృష్ణా!

నీకు చెవులు కుట్టించేవేళ, నీవు భయం నటిస్తూ ముఖం విచారంగా పెట్టడం చూచి ఓర్చుకోలేని నీ తల్లిదండ్రులు నీ సుకుమారమైన చెవి తమ్మెలకు నొప్పితగలడం అసలు యిష్టం లేనివారై, నీమీది ప్రేమతో త్వరగా చెవులు కుట్టేపని పూర్తి కానివ్వమని కంసాలిని తత్తర పెట్టుతుండగా, ఆ తల్లిదండ్రుల బాధని భరించలేని వాడివై —ఎంతోసేపు బెదురుతున్నట్టు నటించే నీ నటనను చూపకుండ, విశ్వమోహనంగా నవ్వావు కదా? ఆ నవ్వడం అసలు మీ తల్లి విచారాన్ని చూడలేకనే కదా?

పాపని రీతిబ్రాకు వ్రజ
బాలకు వక్షపు లక్ష్మి గ్రాంచుటన్
ఓపదు తెంపుగా బతిని
నొప్పుగ జేరను ధాత్రి కావునన్,
గోపకిశోరు డాయమకు
కూరిమి గూర్పగ జొన్పె బొజ్జలో!
పాపము నంద పత్ని కడు
వందురె బిడ్డడు మన్నుదింటకున్! 29

పసిబాలుడై—

దోగాడుచున్న బాలకృష్ణుని వక్షస్థలాన లక్ష్మీ దేవి ఉండటం చూచి, భూదేవి తెంపుగా అతనిని తన భర్తగా బాహాటంగా చేరటానికి సందేహిస్తున్నది. అందుచేత ఆమెను ఆదరించి సంతోష పరచడానికి కృష్ణుడు లక్ష్మితో పేచీ లేకుండగ తిన్నగ తన బొజ్జలోనికి ఆ భూదేవిని ప్రవేశ పెట్టాడంతే! ఈ రహస్యం తెలియని వెఱ్ఱితల్లి కనుక యశోదమ్మ తనకొడుకు మన్ను తిన్నాడని బాధపడింది!

'చూడర చిన్న! పాలకయి
    చూడకు నా యెద నేటినుండి, నీ
యీడున నున్న బాలకు ల
    దెప్పుడొ వీడిరి పాలు ద్రావుటల్,
వాడుక వీడకున్న నిక
    వారు హసింతు ర'నంగ తల్లి, యే
వేడుక మోము కొంగునను
    వేగమె దాచితొ చూపు మాధవా! 30

మాధవా!

యశోదమ్మ నిన్ను పిలచి 'చిన్నా! నీవు ఇక నుంచి పాలు త్రాగడంకోసం నా వైపుచూడకు! నీ యీడు పిల్లలు ఎన్నడో ఆ యలవాటు మానుకొన్నారు. ఇంకను నీవు ఆ యలవాటు మానుకోకపోతే వారంతా నిన్నుచూచి నవ్వుతారు సుమా!' అని మందలించగా సిగ్గుతో ఆమెకొంగు చాటున నీ ముఖం ఎలా దాచుకొన్నావో, ఆ దృశ్యం కాస్త మాకు చూపవయ్యా!

'అమ్మరో ! నా కొసంగవలె
నన్నకు చెప్పక వెన్నజున్నులున్,
కమ్మని పాలు మీగడలు
కాచిన నేతులు తీయ తాయముల్,
నెమ్మది తిందు, ముందుగనె
నేనె కడుంగడు పెద్దనౌదు, నే
దమ్మ ! యొ కింత మీగడ'ని
యాశగ విప్పవె నోరు శ్రీహరీ ! 31

శ్రీ హరీ !

నీ బాల్యక్రీడలెన్నని చెప్పవచ్చు! 'అమ్మా! అన్నకు తెలియకుండ వెన్న, జున్ను, పాలు, మీగడ, కాచిననేయీ, తీయనితాయాలూ అన్నీ నాకే పెట్టు. ఎంచక్కా తిని అన్నకంటె ముందు నేనే పెద్దవాణ్ణి అయిపోతాను. ఏదీ! కొంచం మీగడ నా నోట్లో పెట్టు' అని తల్లిని ఉబ్బిస్తూ, ఆశగా నోరువిప్పి నిలుచుంటావా నీవు?

కలవుగదే విశేషముగ
కమ్మని పాలును వెన్న నేతులు౯
వలసిన తాయముల్ మనకు
వారల యింటను నేల దొంగిలన్ ?
చిలిపిగ నేను చిన్నపుడు
చేసిన చేతలఁబట్టి వీర లీ
చెలువున మాటి మాటికిని
చేసెద రల్లరి చూడు మమ్మరో ! 32

'అమ్మా !

మనయింట పాలు, వెన్న, నేయీ, తీయని పదార్థాలో కావలసినన్ని ఉన్నాయిగదా ! ఇక వాటిని పొరుగిళ్ళలో దొంగలించ వలసిన అవసర మేమున్నది ? నేను చిన్ననాడు చిలిపిగా చేసిన అల్లరి చిల్లరి పనులేవో ఆధారంగా తీసుకొని వీరంతా ఇప్పటికీ తమ యిళ్ళలో మాయమైన వస్తువు లన్నిటికీ నేనే కారణమంటున్నారు ! ఊరక అల్లరి పెడుతున్నారు. ఇదేమన్నా బాగున్నదా ?' అంటూ నీ యమాయకత్వాన్ని గూర్చి తల్లితో చెప్పకొంటావు గదా !

వెన్నల దొంగిలించి తిను
　　వేడుకతో నుపనందు నింటిలో
నున్నవి మెక్కుచున్న తరి
　　నొద్దిక బట్టి, ప్రభావతీ సతిన్
కన్నయ! గేలి చేసితివి,
　　కన్న యశోదకు చెప్పి కొండెముల్
తిన్నగ నిన్నుజూప, ముఖ
　　చేలము దీయగ నామె పుత్రుడై! ౩౩.

కృష్ణా!

అంతటి యిళ్ళలో దధి చౌర్యాదులు చేసినట్టే ఉపనందుని యింటిలో కూడ ప్రవేశించి వెన్నలు దొంగిలినవి తింటున్న సమయాన ఆతని భార్య ప్రభావతి అనే యావిడ నిన్ను పట్టుకొని నీతల్లి దగ్గరకు తీసుకు పోయి నిందారోపణ చేసినప్పుడామె 'మావాడలాంటి పని చేశాడనగా నేను నమ్మను' అనగా, 'ఇదిగోచూడు' మంటూ తన కొంగుచాటున ముఖం దాచుకొన్న నిన్ను ఆమెకు చూపడానికి కొంగు తొలగించగా ఆమె కుమారుడే అయ్యావు! అలా ఆమె ప్రయత్నం వమ్ముచేసి గేలి చేశావట. గదా!

చూడవె దీనిపైట పయి
చూచితి చీమను, పిల్ల గ్రోవితో
వేడుక త్రోసి వేసితిని,
వేరొక భావము దున్ననొట్టు! నీ
చేడియ యంతకే మురళి
చిక్కగ చేతికి లాగికొన్నదే!
పాడియ? పిల్ల కుంకలను
వచ్చిన తీరున నేడిపించుటల్? 34

'అమ్మా! చూడవే!

ఈ పిల్లదాని పైటమీద చీమపోతుంటే పిల్లన గ్రోవితో తొలగ ద్రోశాను. అంతేగాని మరొక భావం వుంటే వొట్టు. అంతమాత్రానికే ఈవిడ నామురళిని లాగేసుకొని ఏడిపిస్తున్నది. నాలాంటి కుఱ్ఱకుంలను ఇలాంటి పడుచువాళ్ళు ఏడ్పించడం న్యాయమా?' అంటూ నీ తప్పి దాన్ని ఎదుటి వారివిూద రుద్దుతా వటయ్యా కొంటెకృష్ణయ్యా!

ఆలను గాచువేళ పెరు
గన్నము దింటయు గొప్పయాట, గో
పాలురు చుట్టునుండ నొక
పద్మము వోలెను మ్రుగ్గు దీర్చి, యా
బాలుర చిక్కముల్ దిగిచి
'పంచుడు తిందమ'టంచు నీవు డా
కేలను కోలనూని, వల
కేల భుజించుట గాంచిరే సురల్ ! 35

కృష్ణా!

నీవు గోపాలుడవై గోవులు కాయడానికి అడవికి వెళ్లినపుడు నీతోటి గోపాలకుల నందరినీ పద్మం లాగా మ్రుగ్గు తీర్చినట్టు నీచుట్టూ నిలబెట్టి, వారి చిక్కాలను లాగి 'చల్ది అన్నాన్ని పంచండి తిందాము' అంటూ, ఎడమ చంక క్రింద కఱ్ఱను ఊతగా పెట్టుకొని, కుడి చేతితో అన్నము తినే క్రీడను దివినుండి దేవతలు చూచి ఆనందించారు గదా!

గోవుల బిల్చినావు కద
కూరిమి పెట్టిన ముద్దు పేళ్ళతో,
రావె మనోహరీ! సురభి!
రమ్మ భగీరథ రాజపుత్రి! రా
దేవి ధరిత్రి! భారతి! యు
దీర్ణ మణీ! వన చంద్రికా! శుభాం
గి! విజయా! జయా! యనుచు,
గెంతుచు రానవి, కృష్ణ! ప్రీతితో. 36

కృష్ణా!

అడవిలో చెదరి మేస్తున్న ఆవులను నీవు ప్రేమతో పెట్టుకొన్న ముద్దు పేర్లతో రావే మనోహరీ! సురభీ! భగీరథపుత్రీ! ధరిత్రీ! భారతీ! శుభాంగీ! ఉదీర్ణమణీ! వనచంద్రికా! జయా! విజయా! అని పిలవగానే, అవి ఎంతో ప్రేమతో గెంతుకొంటూ నీ చెంతకు వచ్చి చేరుతాయి గదా!

వల్లవు లెల్ల నిన్ను తమ
వాడవు, స్వామివి! రక్షకుండ వం
చుల్లము నీవయి న్నిలిపి
యుండ వనాంతము నందు నల్దిశల్
పెల్లుగ గారు చిచ్చపుడు
భీషణమై చెలరేగి రాగ, నీ
వెల్లర కళ్లుమూయు డని
నెవ్విధి మ్రింగితి కృష్ణ! యర్చినిఙా 37

కృష్ణా!

కాళీయుని మర్దించి నీమహిమ చూపి, గోపకుల కెల్ల రకూ నీవే ఏలికవూ, రక్షకుడవూ అనే నమ్మకం కలిగించి, వారందరూ అడవిని ఆనందోత్సవం చేసుకొంటూ వినోదిస్తున్న సమయాన నలువైపులనుండీ క్రమ్ముకొని వస్తున్న కారుచిచ్చును చూచి, అది వారిని, కబళించకుండా అందరినీ కళ్ళు మూసుకొమ్మని చెప్పి, గుటుక్కున ఆ దావాగ్నిని పానం చేశావా స్వామీ! (వారు కళ్ళు మూయకపోతే బాలుని రూపంలో స్వామిచేసే సాహసకార్యాన్ని చూచి భరించలేరు గదా!

కొండను దాల్చి ఛత్రముగ
గొల్లల గోవుల గాచు టెట్లొకో,
మెండుగు నీ మహత్వముల
మిక్కిలి జేసిన తీరుగాని,
కొండను నెత్తగల్గినను
కొప్పుగ నిల్చునె కృష్ణ! వ్రేలిపై,
కొండయె గాని నాడు నొక
కొంపయు నండగ లేదె వృష్టికిన్! 38

కృష్ణా!

కొండను గొడుగులా ధరించి, గొల్లలనూ గోవులనూ ఎలా కాపాడ గలిగావు? ఈలాంటి అభూత కల్పనలతో నీ మహిమను ఇనుమడింప జేయాలనే తపనేతప్ప ఇలా వర్ణించిన వారికి నీ వొకవేళ కొండను ఎత్తగలిగినా అది ఒక వ్రేలికొసను నిలువగలదా? అనే లౌకిక భావన కలిగినట్లు లేదు. ఆనాటి యాదవులకు గొప్ప వర్షం వస్తే తల దాచుకోవడానికి ఆ యెత్తిన కొండతప్ప ఇళ్లేమీ లేవా?

తడిసిన ముంగురుల్ ముఖము
   దప్పగ ద్రోచుచు నొక్క చేతితో,
మడుగున నున్న కాళియుని
   మర్దన చేయగ, నొండు కేల నీ
వొడియుచు పట్టి పుచ్ఛమును
   నుద్ధృత మస్తక మందు తాండవం
బడుగులు చిత్రరీతి బడ
   నచ్యుత! చేయగ నెట్లు నేర్చితో! 39

అచ్యుతా!

తడిసి మనోహరంగా ముఖంపై ముసురుతున్న ముంగురులను లీలగా ఒక చేతిలో ప్రక్కకు తొలగ ద్రోసికొంటూ, మరొక చేతితో మడుగు లోని కాళీయుని తోకను వొడిసి పట్టుకొని, రోషంతో పైకెత్తిన ఆతని పడగల మీద చిత్రగతులతో తాండవం చేయగల నేర్పును ఎలా సంపాదించావు స్వామీ!

ఆతప వేళ నన్నయును
నాలను గాచెడు నీవు నొక్కచో
ప్రీతిగ నిల్చి వత్సముల
బిల్వగ పిల్లన గ్రోవి నూదగా,
మీ తిరు నామముల్ చెదర
మించిన స్వేదము జూచి మేఘుడే
శీతల ముత్యముల్ దొలకు
చిత్రపు ఛత్రము బట్టెనే కదా! 40

ఎండలు చెరిగే వేళ ...!

నీవూ: మీ యన్న బలరాముడూ, ఒక చోట నిలచి, బీళ్ళలో తిరుగాడు తున్న లేగల్ని పిలవటానికని పిల్లనగ్రోవి నూదగా, ఆ కించిత్తు శ్రమకే మీనుదుట చిరుచెమటలుపోసి తిరు నామ రేఖలు చెదరిపోవు చుండగా, మీకు చల్లదనం కూర్చడానికి మేఘుడు చల్లని చినుకు ముత్యాలు వ్రేలాడదీసిన అందమైన గొడుగును మీదపట్టి సేవించాడు కదా!

గోపుల గోప బాలకుల
కుత్సితుడై యటు బ్రహ్మ క్రుచ్చిలఁగ
నీవు సృజించి మస్పితివి
నీరజ నేత్ర! విరించి చింతిలఁగ.
నీవొక గోప బాలుడని
నీసుతు డెట్టుల నెంచెనో కదా!
జీవుల సృష్టిజేయు విధి
చిత్రము నిన్గన లేక పోవుటల్! 41

నీరజ నేత్రా!

గోకులంపై పెత్తనం నీదికాగా, వారికి ఇతర మైన దైవాలకంటే నీవే అధికంకాగా, బ్రహ్మ అడవికేగిన గోపులనూ, గోపాలురనూ దాచి పెట్టి నీగొప్పదనం ఎలా నిల్పుకొంటావో పరీక్షించాడు. కాని, నీవు మాయగోపులనూ, మాయ గోపాలురనూ సృష్టించి ఏమీ తెలియ నట్టుండగా, బ్రహ్మ తన తప్పు తెలుసుకొని గోపాల, గోబృందాన్ని విడుదల చేశాడు. అసలా బ్రహ్మ నీ సుతుడేకదా? సకల జీవరాశినీ సృష్టించి వాటి నడతలు నిర్దేశించడం ఆతని పనికదా? ఆయనకు నిన్నుగూర్చి తెలియక పోవటం వింతగా ఉన్నది!

పాలను ద్రావి గోవులను
  పాలన జేయుట వాని భాగ్యమో!
పాలను నిచ్చి విశ్వమునె
  వక్త్రమునం గను టమ్మ యోగమో!
పాలను గ్రోలి గోపజన
  భద్రము గూర్చుట వారి భూతియో!
పాలను ఖీల్చి రక్కసికి
  ప్రాణము లూడ్చుట విశ్వశాంతికో! 42

కృష్ణా!

ఆత్మార్పణ చేసుకొన్న భక్తులకూ, నిష్కల్మష మైన ప్రాణి కోటికీ, నీవు కొంచం త్యాగానికే గొప్ప ఫలితాన్నిస్తావు! ఆల మందలు నీకు పాలిచ్చి నిన్ను తమ పాలకుడ్ని గావించుకొన్న ఘనత గొన్నాయి! యశోదమ్మ నీకు పాలిచ్చి-నీనోటినుంచే విశ్వాన్నంతా దర్శింపగలిగింది! గోకులంలో నీవు క్షీరాన్ని అపహరించావనే అపోహేగానీ, నీవు వారికెంత క్షేమాన్ని గూర్చావు?! సహృదయంతో పాలిచ్చినఇందర్నీ ధన్యులను చేసినట్టే పూతన దురుద్దేశంతో ఇచ్చినా—ఆమెనుకూడ కడతేర్చి లోకకల్యాణమే కలిగించావు కదా?

'మన్నది మెక్కనే యొకడు
మక్కువ ? నమ్మరొ ! యన్న నాపయిఁ
మిన్నక చెప్పు కొండెములు,
మీగడ నీ వొసగంగ దింటి, నే
మున్నది నాదుబొజ్జ ?' నని
యొద్దిక నోటిని బొజ్జ చూపుచుఁ
కన్నయ ! నోట జూపితట
గాదె ! కడుంగడు సృష్టు లమ్మకుఁ ! 43

కృష్ణా!

నీ బాల్య క్రీడలలో భాగంగా మన్నుదిన్నట్టు నటించి ఆవిషయం మాయన్న బలరాముడు యశోదమ్మకు చెప్పగా 'అమ్మా! మన్నేమైనా రుచిగల వంటకమా? దాని నెవరైనా తింటారా? అన్న యేదో నాపై కొండాలు చెప్పాలని నీకు చెప్పాడంతే! నీవిచ్చిన మీగడ తప్ప మరేదైనా తినివుంటే వొట్టు'! అంటూ నోటినీ, బొజ్జనూ చూపగా, ఆతల్లి నీ నోటిలోనికి తొంగి చూచి నప్పుడు, ఎన్నో లోకాలను చూపావట గదా ?!

పసులను బట్టు పగ్గముల
బాగుగ జుట్టియు మస్తకంబులన్,
పసగల లేగ పట్టెడల
వాసిగ దాల్చి భుజాల విందుగా,
కసవును మేయు నాలకును
కమ్మని వేణువులూది, గొల్లలై
మసలిన రామ కృష్ణులను
మాయురె! పొల్పగ నేర్తురే సురల్ !? 44

బలరామ కృష్ణులు—

మానవులై వ్రేపల్లె గొల్లలుగా మసలుతున్న తీరులు ఎన్నో చెప్పలేము! మచ్చిక గాని పశువులను పట్టే పొడవైన పగ్గాలను తలపాగాలవలె వారుచుట్టుకున్నారు. లేగల మెడలకు అందంగా కట్టే మువ్వల పట్టెడలను భుజాలకు తగుల్చుకొన్నారు. గడ్డి పరకలు కొరుకుతున్న ఆవులకు కమ్మగా వేణుగానంతో విందుచేస్తూ వినోదిస్తున్నారు. అలాంటి లీలామానుష రూపధారులను దేవతలైనా పోల్చుకో లేరుగదా?!

మావి చిగుళ్ళు కంఠమున,
మానిత పింఛము చిన్ని జుట్టుపై,
వావిలి పూల మాలికయు,
వంశియుఁ గల్వల హార మొప్పగా;
ధోవతి నల్లగా నొకరు!
తుల్యము పీత పటంబు నొక్కరుఁ!
గోవుల గాయు వేసముల
గొప్పగ దాల్చిరి రామ కృష్ణులుఁ! 45

కారణ జన్ములైన—

అన్నదమ్ములు—ఆ రామకృష్ణులు ఆలకాపరుల రూపాన చరిస్తున్నారు! అందు బలరాముడు మావిచిగుళ్ళు కంఠహారంగా దాలిస్తే, నల్లనయ్య తన చిన్ని జుట్టుపై నెమలి యీకలను అలంకారంగా ధరించాడు! అన్న, వావిలి పూల మాలను కంఠాన వేసుకొంటే; తమ్ముడు కలువ పూమాలను ధరించి మురళిని చేతబట్టి ప్రకాశిస్తున్నాడు! రాముడు నీలాంబరాన్ని కట్టుకోగా, కృష్ణుడు పీతాంబర ధారియై పొలుపారుతున్నాడు!

తెల్లని మల్లె మొగ్గలట
    తీరుగ నొప్పెడి నీదు దంతముల్ !
వెల్లని తమ్మి జంట యట
    విందుగ వెల్గెడి నీదు నేత్రముల్ !
జల్లున పుల్కరించు నట
    జవ్వని లోకము మోము గన్నచో !
పెల్లుగ కోర్కెలూరు నట
    వీనుల సోకిన వేణు గానముల్ ! 46

మోహనా !

నీ యందాలను ఇట్లుంటాయని చెప్పబూనటం అసాధ్యం ! కాని, నీపల్వరుస తెల్లనిమల్లె మొగ్గలనీ, వెలిగే కన్నులజంట తెల్లదామర పంటయనీ, నీ ముఖ సందర్శన మాత్రాన యువతీ లోకము పులకరించి పోతుందనీ, నీ మధురమురళీ రవళి చెవిసోకి నంతనే మనసులో మరల్చుకోరానికోరికలు మొలకెత్తుతాయనీ, అంటారుమరి!

మాధవు తీయనౌ యధర
మాధురి చొక్కుచు సోలు భాగ్యముల్.
మాధవు నందమౌ వదన
మంగళ సేవలొనర్చు భోగముల్,
మాధవు సుందరాంగుళుల
మత్తుగ నొత్త బడంగ రాగముల్,
ఈధర నొంద, పుణ్యముల
వెన్ని ఫలించెనో వంశి! నీకుగా. 47

అదృష్టవంతు రాలివైన ఓవంశీ!

ఆమాధవుని తీయని అధరాల మాధుర్యాన్ని జుఱ్ఱుకొంటూ మైమరచే భాగ్యం పొందటానికీ, అందమైన, మంగళకరమైన అమహాత్ముని ముఖం సమీపాన నిరంతరం సంచరిస్తూ శుభకరమైన సేవలు చేయటానికీ, సుందరమైన ఆతని చేతివ్రేళ్ళచేత మత్తెక్కేటట్లు నొక్కబడే అను రాగాన్ని అందుకోవడానికీ, నీవు పూర్వజన్మల్లో ఎన్నిపుణ్యాలు చేశావో కదా!

వేనకు వేల గోపికల
 పెన్నిధియౌ అధ రామృతంబు నీ
వే నిముసంబు వీడ్వడక
 నెంతయు వెఱ్ఱిగ జుఱ్ఱుచుండ, నా
మానవతుల్ దలంచెదరు
 వ్రానయి నీవలె పుట్టబోలు నం
చానయ మార్గ పొందితిని
 అందగ జేయవె వంశి! వారికిన్. 48

ఓ వంశీ!

వేలాది మంది గోపికల పెన్నిధియైన గోవిందుని, అధరామృతాన్ని నీవు నిరంతరం ఎడతెగక ఆస్వాదిస్తుండగా, ఆగోపికలు అనుకొంటారు. గదా—! కనీసం నీవలె వ్రానయి పుట్టక పోయామని! ఆవిధంగా మాధవుని మచ్చిక చేసుకో గలిగిన మర్మమేదో నీవైనా వారికి బోధించి పుణ్యం కట్టుకోరాదూ!




బాలుడవేన! బువ్వతిన వల్లనుకాద?...పాలను గల్పి
పళ్ళెమున వాసిగ నుంచిన యన్నమంతయుఁ బేలగ
బుల్లి చేతులను పిండుచు, బొక్కుచు రాల్చు నేలపై...

(పుట-6)

లలితపు వేణు గీతికల
లాలితమై భువనాలు దేలగా,
సలిలము లిచ్చి వంశ తతి
సాకిన ప్రేమ, హ్రదాలు హర్షముతో
కలిత వికస్వరం బయిన
కంజ తరంగము లందు జూపెబో!
తెలియగ నిట్టివే స్వజన
దివ్య కృతుల్ విన బంధు కోటికిన్! 49

లలితమైన—

వేణు గీతాలతో ఈ లోకాలన్నీ లాలింపబడి ఆనంద సాగరంలో తేలియాడుతుండగా, అట్టి ఘనకార్యం చేసి లోకాలలో గొప్పగా గుర్తింపు పొందిన వేణువుపుట్టుకకు కారణమైన వెదురు పొదలకు - తాము నీటినిచ్చి పెద్ద చేసిన కారణాన, సరోవరాలు తమ పట్టరాని ఆనందాన్ని తామర తరంగాలతో తెలియజేస్తున్నాయి! అంతే గదా మరి! లోకంలో తమ బంధుకోటి లోని వారెవరైన గొప్పవారైతే - వారిని గూర్చి బంధువులంతా గొప్పగా చెప్పుకొం టారు. అంతేగాదు! తమకును, వారికినీ గల చుట్టరికాన్ని గూర్చి వర్ణించి చాటుకొంటారు కూడా!

మధువును చిందుచున్న వదె
  మాధవు మోహన వంశి గానమున్
మధురము గాగ గ్రోలి, తల
  మందము మందము గాగ నూచి, 'ఈ
మధుర రసాబ్ధి వీచి తతి
  మామక వంశజ మం'చు తీవితో
నధరము లప్పళించి యును,
  'ఆహహా!' యంమను వంశ వృక్షముల్, 50

వెదురు పొదలు—

అదిగో! మధువును చిందిస్తున్నాయి! తీవిగా తలలెత్తి, మురళీలోలుని వేణుగానాన్ని మధురంగా, తనివిదీర ఆస్వాదిస్తూ, మెల్ల మెల్లగా - మెచ్చికోలుగా తలలూస్తూ, ఈ మధురగాన రసవీచికలు మా 'వంశం' నుంచి పుట్టాయని గర్వంగా చెప్పుకొంటూ, పెదవు లప్పళించి 'ఆహా! ఆహా!' అంటూ - ఆనందిస్తున్నాయి!

మురళి రవంబు సోకి మది
మోద తరంగితమై, నదీ సుతల్
వరలె విరాళి, నంతటనె
వాంఛితముల్ తళుకొత్త క్రొత్తగా
తరగల చేతులం దనియ
తామర కాన్కలనుంచి యంఘ్రులం,
బరుగులు మాని 'యుస్సుర'ని
వ్రాలును సాగరశాయి! ప్రేమతో! 51

సాగరశాయీ!

నీ మురళీరవం విని, మనసు సంతోష తరంగితమై, నదీకన్యలు నీతోటి విరహాన్ని అనుభవించసాగారు. అంతలోనే మనసులో క్రొత్తకోరికలు చిగురించి తమ తరంగాల చేతులతో తామరలు తీసుకొనివచ్చి, పరుగు తగ్గించి నెమ్మదిగా నిట్టూరుస్తూ నీ పాదాలమీద నుంచి 'ఉస్సు'రని వ్రాలిపోతున్నారు! వారి తమకం అలాంటిది!

గర్వితయౌను వంశి! కడు
గానధురీణ, గుణానజాణ, గాం
ధర్వకళాప్రపూర్ణ యగు!
తానెవ డుల్కదు పల్క దేరితో!
సర్వ కళామయుం డయిన
సారస నేత్రుని జూచి నంతటన్
పర్వెన మూకభావ మది
బాయగ విన్చు స్వరాళి కేళిమై. 52

వంశి—

కడు గర్విష్ఠయైన కాంత! ఎందుకనగా, ఆమె గానంలో జాణ, గుణగణాలలో ప్రవీణ! సంగీత శాస్త్రంలో పరిపూర్ణత సాధించింది. అందుచేత ఎవ్వరితోను సరిగా పల్కదు. సర్వ కళామయుడూ, సారస నేత్రుడూ అయిన మురళీ మనోహరుని చూడగానే తన మౌనాన్ని విడచి వినోదంగా తన గానాలు వినిపించడం మొదలు పెడుతుంది. (శాస్త్రం రానివారి చేతిలో వాయిద్యం ఎలాగూ పలకదుకదా?)

మురళి యధీన భర్తృకయి
మోహను మధ్యము వంపు ద్రిప్పుచుఁ,
కరముల క్రమ భంగిమల
కట్టడ సేయును, నోర పాదమై
విరివిగ వ్రేళులం గదుప
వేడుక నూపగ మస్తకంబునుఁ,
విరచగ నోష్ఠ బింబమును
వెన్నుని కిచ్చును నాజ్ఞ లెన్నియో। 53

మురళీ మానిని—

స్వాధీన పతిక యైన శృంగార నాయిక! ఆమె తనయిష్టానుసారం భర్త నాడిస్తుంది. అత డామెను చేపట్టినపు డామెకిష్టమైన విధంగా నడచుకో వలసిందేకాని, తన యిష్ట మంటూ ఏమీ వుండదు. ఆతడి నడుమును వంపుగా త్రిప్పమనీ, చేతులను అందమైన భంగి మలో ఉంచుకోమనీ, ఓరపాదమై నిలబడమనీ, చేతివ్రేళ్లు యిలా-యిలా-కదపమనీ, వినోదంగా తలయూచమనీ, పెదవులు ఇలా విరచి పెట్టుకో మనీ ఎన్నో విధాలుగా ఆజ్ఞలిచ్చి కృష్ణుని నియంత్రిస్తుంది!

మధురను బృందసీమ గల
మానిను లందర 'వంశి' ధన్య యౌ.
అధరము శయ్యజేసి 'హరి'
హత్తును ప్రౌఢ కరాంబుజంబులన్.
సుధ లొలికించు సుశ్రుతుల
సొమ్మసిలం జెపినూదు మర్మముల్,
మధుర కరాంగుళుల్ గదిపి
మాటికి చక్కిలిగింత పెట్టు, తన్! 54

వంశిలా—

మధురలోను, బృందావని లోను మరొకరు అంతటి ధన్యురాలు కానరారు! ఎందుకనగా, శ్రీహరి ఆమెనంతగా ఆదరిస్తాడు! తన పెద వులపైనే ఆమెకు పడక సమర్చి నేర్పువహించిన తన కరపద్మాలతో హత్తి, మంచి మాటల (మంచిపాటల) తో అమృతం కురిపిస్తాడు! చెవిలో మైమరపించే మర్మాలు పలుకు తాడు! (మురళి రంధ్రాలలో మెలకువలు తెలిసి గాలి నూది, స్వర రహస్యాలు తెలిసినవారు మైమర చేటట్లు చేస్తాడు!) నాజూకైన వ్రేళ్లు చాల చక్కంగా కదిపి, చక్కిలిగింతలు పెట్టిలాలిస్తాడు! (అంగుళీ చాలనంతో అద్భుతంగా మురళిని పలికిస్తాడు!)

నీ చరణాంగుళీ నఖ వి
 నిర్గత చంద్రికలందు మగ్నులై
తా చరితార్థులైరి గన
 తామర చూలియు వాసవాదులుం!
నీ చవులూరు మోవి పయి
 నిస్తుల భోగము లందు వంశి కిం
కెంచగ నేమి యబ్బునొకొ!
 ఎవ్వ రెరుంగుదు రయ్య మాధవా! 55

ఓయీ! మా మనోరమణా!

నీ కాలి గోళ్ళనుండి వెలువడిన కాంతులందు మునిగిన బ్రహ్మ, ఇంద్రుడూ మొదలైన దేవతలు ధన్యులై విశ్వంలో దేవతలుగా పరిగణింపబడి పూజింపబడు తున్నారు. అలాంటప్పుడు, కాలిగోళ్ళకంటె మిక్కిలి విలువైన నీ తీయని పెదవులమీద నిరంతరం నిస్తుల భోగాలు అనుభవిస్తున్న నీమురళికి ఇంకెన్నెన్ని మహిమలూ, భోగ భాగ్యాలూ, కలుగనున్నాయోకదా!

ఘన వనమాలి వంశగొని
   గానము చేయగ బూనినంతనే
మన మదిలేని స్థావరపు
   మర్మములే గదలాడి జంతులౌ;
మనములు గల్గు ప్రాణులకు
   మంత్రములై, స్వరబీజ భావముల్
గొనకొని స్థావరత్వమును
   గూర్చును, చేతన మూగబోవగా! 56

ఆవనమాలి...!

మురళీగానం మొదలు పెట్టగానే హృదయం లేని జడప్రకృతికి కూడ వినేశక్తి అబ్బుతుంది కాబోలు! అందుకే అది కరిగి జంతు ప్రకృతిగా మారిపోతున్నది! ఇక హృదయమున్న జంతు ప్రకృతి - ఆగాన మాధుర్యానికి తమ హృదయాలు మూగబోగా, (సంగీత స్వరబీజాక్షరాలు ప్రభావాన్వితమైన మంత్రములా పనిచేసి) జడ ప్రకృతిగా మారిపోతున్నది!

సాధన జేసి యోగిజన
సంఘము వీనుల విందుగా వినున్
బోధన కందరాని దగు
పుణ్య వినోదము, నాద మోదముం,
బోధన సాధనల్ గనని
పుణ్యలు! పామరు లైన గోపికల్,
ఈధర వేణు మాధురుల
నింపుగ గ్రోలి తరించి రొప్పుగా! 57

వేణు మాధుర్యం...

వీనుల విందుగా విని, వృత్తి నిరోధంవల్ల జనించే ప్రణవ నాదానందాన్నీ, అబోధ సౌఖ్యాన్నీ, అనుభవించటానికి - యోగులైన వారు ఎంతో సాధన చేసి అరుదుగా ఆస్థితిని అందు కొంటారు! కాని, ఈ పామర గోపికలు కేవలం మూఢభక్తీ, నగ్నప్రేమల చేతనే ఆయానందాన్ని చూరగొంటున్నారు! నిరా టంకంగా వేణు గానామృతాన్ని గ్రోలి తరి స్తున్నారు! (వేణుగానంలో యోగులు జ్ఞాన మార్గంతో-సాధనతో ప్రణవాన్ని వినితరించగా, గోపికలు - గానతన్మయతలోనే ఆ స్థితినందు కొంటారు!)

సాగరు కౌగిలిన్ సురగ
 నద్వీధి సాగు సరిత్తు లెంతయున్
మ్రోగెడు వేణు మాధురుల
 మోహమునంబడి, ముందు కేగకన్
ఊగు తరంగ బాహువుల
 నుత్పల కాన్కల దెచ్చి మాధవున్
రాగ మయంబుగా, చరణ
 రంజన జేయును గూర్చి యర్చనన్ ॥ 58

వేణు మాధురీమహిమ...

ఎంత గొప్పదనగా -! సాగరుని కౌగిలిని అందుకోవడానికి పరుగులుతీసే నదీసతలు ఆగానం విని, మధురానుభూతితో స్తబ్ధలై ముందుకు సాగక ఒకింత ఆగి, వెనుదిరిగి, ఊగిసలాడే తమ అలలనే అందాల చేతులతో కలువల కాన్కలుగా తెచ్చి, మాధవుని పాదాలపై పేర్చి, అర్చించి, ఆ మహాత్ముని చరణాలను తమ అనురాగ రాగరంజితం చేస్తున్నారు!

కమ్మని వేణు గానమును
గాంక్షను గ్రోలుచు గోవులేలనో
దిమ్మెర వోయి చూచుటలు?
తీరుగ శ్రావము లెత్తి నిల్చుటల్ ?
అమ్మక చెల్ల! వంశిని, సు
ధామృత ధారలు జాలువారగా
గ్రమ్మిన మాదకత్వమున
గర్ణ పుటంబుల నాపె నావులున్! 59

కమ్మని వేణుగానాన్ని—

కోరికమీరగ జుర్రుకొంటూ, గోవులు ఎందుకు దిమ్మెరపోయిచూస్తున్నాయి? చెవులు పైకెత్తి ఎందుకలా నిలబడ్డాయి? ఔరా! తెలిసింది! మురళినుండి జాలువారిన అమృత ధారలు వాటికి మత్తెక్కింపగా, ఆయమృతం ఒక్క చుక్కగూడ చిందకుండ ఆస్వాదించాలనే కోర్కెతో తమచెవులను దొన్నెలుగా పైకెత్తి పట్టుకొని అలా ఆస్వాదిస్తున్నాయి!

కన్నని రూపు గన్నులను
గైకొని ధేనువు లాత్మ లోనికిన్,
క్రన్నన బాష్పముల్ విడచు
కమ్మని భావన మేన నిండగా,
వన్నెల పాలుద్రావు పలు
వత్సము లద్భుత వేణులాహిరిన్
విన్నదనంబునన్, గుటక
వేయమి, క్షీరము జిందు మూతిపై! 60

కృష్ణుని—

మనోహరమైన రూపాన్ని కన్నుల ద్వారమున ఆత్మలోనికి ప్రవేశపెట్టినందువల్ల, వాటికి నిలువెల్ల మాధవుని మధుర భావం నిండి, కన్నుల నుండి ఆనంద బాష్పాలు రాలుస్తున్నాయి! అలాగే పాలు త్రాగే లేగలు వేణుగాన లహరితో మైమరచి, అబ్బురపాటుతో పొదుగును గ్రుద్ది పీల్చిన పాలనైన గుటకవేసి మ్రింగటం మరచిపోయి, నిలచి పోవడంచేత, ఆపాలు వత్సాల మూతిమీద చిందు తున్నవి!

ఈవన వృక్ష సంతతిని
    నెప్పుడు కన్నులు మోడ్చి, శ్రద్ధగా
నా వనమాలి వేణురవ
    మంచిత భక్తిని గ్రోలు పక్షుల
భావమునందు మౌనులని
    భక్తి నుతింతును, నట్టు గానిచో
ఈవిధి పండ్లు లేని తరు
    లెక్కి, చిగుళ్లను మౌన మూనునా? 61

పక్షులు—

ఈ వనవృక్షాలపై కన్నులరమోడ్చి, మురళీరవాన్ని శ్రద్ధగా ఆలకిస్తున్న వైనంచూచి ఇవి మునులు కాబోలు! అనుకొంటున్నాను. అలా భావించడానికి కారణం—ఫలహీనమైన చెట్లపై చిగుళ్ళమధ్య మౌనంగా కూర్చొని వేణుగానాన్ని భక్తితో ఆస్వాదింపవు గదా సాధారణమైన పక్షులు! (ఈ మునులు వేదరూప వృక్షశాఖలను ఆలంబనగా చేసుకొని, కర్మఫలాన్ని విడచిపెట్టి, సుందరమైన జ్ఞానోదయ మనబడే చిగుళ్ళ రూపంలోని ఫలితాన్ని మాత్రం స్వీకరిస్తూ మురళీ గాన రూపమైన భగవంతుని కథలను వింటున్నట్లుగా వున్నారు!)

నాకము కన్న బృంద కడు
నాణెత గన్నది, కీర్తి గొన్న దౌ
నాకము నందు లేని దగు
నంద కిశోరుని రాసకేళియున్,
కేకి విమోహ నాట్యముల
ఖేలన మూలము, వంశి గాన మే
లోకమునందు లేవు, నర
లోకపు నాకమ దౌను బృందసూ! 62

ఈ బృందావని...

నరలోకంలోని స్వర్గము! ఆ స్వర్గానికంటే దీనికి అందమున్నది. కీర్తి గూడ ఉన్నది. ఎందుకనగా, కృష్ణునిరాస కేళి గానీ, నెమళ్లు పులకరించి నాట్యమాడటానికి కారణభూతమైన వేణు గానంకానీ, ఈ లోకంలో, ఈ బృందావనిలో తప్ప, మరెక్కడా కానరావు! అందుచేత ఈ బృందావని గల ఈ మేలోక అన్నిటికన్న మిన్న! భూలోక వాసులకు సాక్షాత్తు స్వర్గము!

సరస రసాల గోపికల
　　సార తరంబగు మోవి పల్లవా
ల్సరగున రాగమూనె తొలి
　　సారిగ నూదిన వేణు గీతితో;
మరునికి మక్కువైన కుసు
　　మంబులు నందున వాడినూనగా
బిర బిర నేరి వాని గురి
　　బెట్టడె కంతుడు కృష్ణుఁ గొట్టగా! 63

తొలిసారి పిల్లనగ్రోవి పాటతో—

రసికురాండ్రైన గున్నమావిళ్ళనే గోపికల పెదవులనే చిగుళ్ళు, ఎరుపెక్కాయి! అప్పుడా చిగుళ్ళమధ్య మన్మథుని కిష్టమైన బాణాలు పదునెక్కగా (వాడి మొనలతో మావిపూలు పొడసూపగా గోపికల పక్షాన, వారి పెదవుల మధ్య పూమొగ్గలవంటి పల్వరుస ప్రకాశింపగా) మన్మథుడు కృష్ణునిపై గురిపెట్టడానికోసం వాటిని బిరబిర సేకరించి సిద్ధమాతున్నాడు. (పాట విన్న గోపికల పెదవు లెఱ్ఱవారి ఆతనిపై తమ కంతో పల్వరుస చూపి మోహపెడుతున్నారు!)

మురళిని నూదుకెం బెదవి
మోహములో పడి కొందరంగనల్
మురళి తలాన వ్రేల్మొనలు
ముద్దుగ నాడుట జూచి కొందరుఁ,
మురళి రవాన మత్తుగొని
మోడ్చిన కన్నుల గాంచి కొందరుఁ
పరవశ లౌచు, వేణువుగ
భావన చేతురు తమ్ము మోహనా! 64

మోహనా!

మురళిని మనోహరంగా పలికించే నీ ఎఱ్ఱని పెదవులచూచి మోహములో పడిన కొందరు మదవతులూ; మురళిపై ముద్దుముద్దుగా నీ వ్రేళ్ళు కదలటం చూచి; మైమరచి కొందరు స్త్రీలూ; మురళీరవంతో మత్తెక్కి నీవు నీ అర మోడ్చిన కన్నులతో ఆవాయిద్యాన్ని పలికిస్తున్నప్పుడు, నీ కన్నుల అందాన్ని చూచిన అందగత్తెలు కొందరూ; పరవశించినవారై తామే ఆ వేణువై నట్లు భావించుకొని ఆనందిస్తారు! (నీలో లీనమై-నిన్ను తమలో లీనమొనర్చుకొన్న భావన వారికి కలుగుతుంది!)

మేలిమి రాగ చంద్రికల
మెత్తని నీ యధరాల పొందుతో
గ్రాలిన వంశ నాళమున
కమ్మని కోయిల లెట్లు పాడెనో!
నీల మనోహరుండు సుధ
నింపగ జీవము వచ్చి వంశికిన్,
వేలును కోట్లు కొమ్మలయి
విందగు కోయిల పిండు నిండెగా! 65

మెత్తని అధరాలు—

తాకగానే వేణువులో కోయిలలు రాగ చంద్రి కలను ఎలా ఆలపిస్తున్నవో కదా?! తెలిసింది! నీల మనోహరుడు మురళి లోనికి ఊపిరి నింపే నెపంతో అమృతం నింపడం వల్ల, ప్రాణ హీనమైన వెదురు ముక్కకు మరల ప్రాణం వచ్చి, అందులోనుండి ఎన్నో శాఖలు విస్త రించగా, అక్కడికి కోయిలలు మందలు మందలుగా చేరాయి! అందుచేతే వంశినుండి కోయిల గానాలు వినవస్తున్నాయి!

గాన సుఖంబున న్మొలిచి
  గారడిగా కుసుమించి వంశియుః
మానిత భూజమై, మథుర
  మండిత బృందను విందు గూర్పగా,
మానవతుల్ వినోదమున
  మారిరి మాధవ! కీర శారికల్,
కానక దాగి కొమ్మలను
  కమ్మగ గూయు పికాల రీతిగా! 66

మాధవా!

గాన సుఖంతో ఇంద్రజాలం వలె వేణువు చిగిర్చి, పుష్పించి, మహావృక్షంలా మారి, మథురా నగరికే అలంకారమైన బృందావనిలో అందాలొలుకుతూ ప్రకాశిస్తుండగా, అక్కడ జేరిన హరి ప్రియురాండ్రు వినోదంగా చిలుకలుగా గోరువంకలుగా, కమ్మగ పాడే కోయిలలుగా మారిపోయారు!

నిండు మనంబుతో బిలువ
నీరజ నేత్రను రాధికా సతిన్
కొండొక రాగమూది పిల
గ్రోవిని బల్కుచు చిత్ర గానముల్;
గుండెలపైని వ్రాలు, మరి
గ్రుచ్చియు నెత్తును ప్రేమ కౌగిలిన్,
మెండగు బాష్ప మాలికల
మెచ్చుగ వేయుర నామె మాధవా! 67

మాధవా!

పిల్లన గ్రోవితో ఒకానొక రాగ మాలాపిస్తూ, చిత్ర గానాలాలికిస్తూ, నిండు మనసుతో నీవు రాధను పిలువు! ఆమె పరుగు పరుగున వచ్చి నీ గుండెల మీద వ్రాలిపోతుంది. ప్రేమతో నిన్ను కౌగిలించి, ఆనందభాష్ప మాలికతో నిన్ను అలంకరిస్తుంది!

మధుర మనోజ్ఞ గానమొక
మంజుల సీమను బుట్టి నాట్యమౌ,
మధుర పదోదితం బయిన
మానిత గీతము ద్రోయు వాద్యమున్,
అధరము లద్భు తాకృతుల
నప్పటి కప్పుడు దాల్చి, పాటలో
మధురిమ, మాటలందు లయ
మర్మము జాటును జూడ మాధవున్! 68

ఒక మనోజ్ఞ గానము —

ఒకానొక మనోహర ప్రదేశమునుండి పుట్టి నాట్యముగా మారుతున్నది! ఆగానము మధురమైన పదాలతో కూడినందువల్ల లయాన్వితమై ఒక వాయిద్యంలో ధ్వనిస్తున్నది! పెదవులు అప్పటికప్పుడు అనేక రూపాలను దాలుస్తూ, పాటలోని తీయదనాన్నీ, మాటల కూర్పు నేర్పులోని లయనూ - ఆస్వాదిస్తున్నట్టు చూపరులకు తోస్తున్నాయి! మాధవా, ఇది నీ గానంలోని సంగీత, సాహిత్యాల ఇంపైన మేళవింపు మహిమ సుమా!

మురళిని కామధేను వని
    మ్రొక్కుదు పాటల పచ్చిపాలకై!
మురళిని కిన్నెరాంగనని
    ముగ్ధుడ నౌదును పాట యూటలన్!
మురళిని యక్ష కాంతయని
    మోహము నందుదు మంత్ర శక్తిచే!
మురళి సపత్నియౌ ననుచు
    మూతిని త్రిప్పుదు నేను మాధవా! 69

మాధవా!

నేను నీ మురళిని కామధేనువని మ్రొక్కుతాను. ఎందుకనగా-పాటలనే పచ్చిపాలను అది యివ్వగలదు! ఆ మురళినే కిన్నెర కాంతగా భావించి అబ్బుర మందుతాను. ఎందుకన్నావా? అందునుండే పాటలు ఊటగా పుట్టి ప్రవహిస్తాయి గనుక! ఆ వంశినే యక్ష కాంతగా భావిస్తాను. కారణం! ఎదుటివారిని మోహంలో ముంచి, కట్టి పడవేసే మంత్రశక్తి అందులో ఉన్నది! ఆ మురళినే నా సపత్నిగా భావించి, ముఖం త్రిప్పుకొంటాను. ఎందుకనగా నాకు భోగ్యమైన అనుభూతిని అది అందుకొంటున్నదనే అసూయ వల్ల!

మరి మరి మారు మ్రోగగను
మాధవ! వేణువు నూది వేసటన్,
మరియొక యాట వ్రేతలకు
మంచి వినోదము గూర్ప గూర్పగా
అరిమురి గ్రోలు చుండెదరు
నత్తరి నైనను నీ ముఖంబునన్
విరిసిన హాస సంపదల
వేణు రవానుభవంబె తృప్తిగా! 70

మాధవా!

మరల మరల ప్రతిధ్వనించేటట్లు వేణువునూది యూది, వేసటతో శ్రాంతిదీరే వరకు గొల్ల పడుచులకు మరొక ఆట కల్పించి వినోదింప జేయదలిచావు. కాని వారుమాత్రం, ఆయాట లోని వినోదానికి వినోదించటం లేదు. కేవలం – అప్పుడుకూడ నీ ముఖంలో వెల్లి విరుస్తున్న నవ్వులనుండి పూర్వం పొందిన వేణురవాను భవాన్నే తృప్తిగా గ్రోలుతుం టారు!

మోవిని మాధురుల్ గొనుచు
    మోహనమౌ స్వరముల్ వెలార్చు నా
జీవము లేని వంశి యెటు
    చేసెనొ పుణ్యము పూర్వ జన్మలో!
మా వెలలేని యౌవనము
    మండగ కప్పుర మట్లు, కొల్చినన్
రా వటువంటి భాగ్యములు!
    రాగము మృగ్యము జీవితాంతమున్! 71

ఓరా!

ప్రాణం లేని వెదురు ముక్కగదా ఆ మురళి! అది యెంతటి పుణ్యం ఆర్జించుకొంది! ఆ మురళీ మనోహరుని మోవిమీద నుంటూ, ఆ తియ్యదనాన్ని తాను దక్కించుకొంటూ, విశ్వ మోహనమైన స్వర తరంగాలను వెలువ రిస్తున్నది! మా - అమూల్యమైన యౌవ నాన్ని హారతి కర్పూరంలా కరిగించి, అతనికై తపించి పరితపించినా, అంతటి భాగ్యం మా కందినదా? ఈ జీవితంలో ఆ మురళిలా మే మాతనికి ప్రేమాస్పదులం కావడం కల్ల! (అంటున్నారు విరహిణులైన కొందరు గోపి కలు.)

మురళి విరాళి గూర్చు కృతి
మోదముతో బలికించి వ్రేతలన్
తరళ విలోచ నాంతముల
దళ్కుల ముల్కుల నేచు టొప్పునా?
మరులును రేపువాడ వతి
మాత్ర వియోగము గూర్పకుండ, నే
మరచియు జారకుండగ న
మాయికలన్ మురిపించు మాధవా! 72

ఓ మాధవా!

నీవు మురళిని సవరించి, విరహగీతి నాలపించి, గొల్ల పడుచుల తళతళలాడే నీ క్రీంగంటి చూపుల ములుకులతో నొప్పించదగునా? మమకారాన్నయితే కలిగించావు కాని, అమాయికలూ, సున్నిత మనస్కులూ అయిన జవరాండ్రకు విరహతాపం తీవ్రం కాకుండగ, ఆశలు రేపి జారుకొనకుండగ సంతోష పరిస్తే బాగుండదా?

మగువల ప్రాణ మానముల
మర్మము దాచితి కృష్ణ! వంశిలో,
రగులును తాపవహ్ని యొక
రాగము నూదిన, గోపికా హృదుల్
పగులును, నోర్పలేని తమి
వచ్చును, చొచ్చును బృందలోన, నీ
జగమును లెక్కచేయకయె
చంచల చిత్తము, నగ్నవృత్తమై! 73

కృష్ణా!

నీ మురళిలో మగువల మానప్రాణాల మర్మమేదో దాచియుంచావు. లేకపోతే, ఒక రాగం ఆలపిస్తే చాలు! గోపికలలో తాపం రగిలి, హృదయాలు పగిలి, తాళలేని తమకంతో వారీ లోకాన్ని లెక్కచేయకుండ, పరుగులెత్తి వచ్చి బృందావనిలో ప్రవేశిస్తున్నారు కదా! ఆ మురళిలో నీవు దాచిన మహిమ కాకపోతే మరేమిటది?

నంద కిశోర ! నీ మధుర
నామ జపంబున బృందలోని యా
మంద మరాళ గామినులు
మారుని తాపము బాపికొందు మం
చుందురు గాని, నీ నడచు
చుండిన దారుల నవ్వు పువ్వులన్
కుంద సబంధు కుంజముల
కూటములన్ స్మరియించి యేడ్వరే! 74

ఓ నంద నందనా!

బృందావనిలో హంసనడకలతో సంచరించే అంగనాజనం, నీ మధురమైన నామజపం చేస్తూ తమకు గల్గిన మదన తాపాన్ని పోగొట్టుకో గల మనుకొంటారు గానీ, ఆ బృందావనిలో నీవు నడచిన దారుల తలచుకొని, నవ్వైన నవ్వులను స్మరించి, పూబొదలలో నీ సాహచర్యాన్ని గుర్తు చేసుకొని, కడకు ఏడ్వడమే వారికి శరణ్య మౌతుంది.

తేనియ లూరు మోవిపయి
తీరుగ వంశిని మోపి 'మోహన'
గానము సేయ; దాని మొన
గ్రాలెడు ముత్తె సరాలు చెక్కులం
గాన బడంగ, స్వేదమని
గాంచిన రాధయు భ్రాంతిజెంది, తా
నే నిను శ్రాంతిదీర నని
నెమ్మది యొరగ బిల్చె మాధవా! 75

మాధవా!

తేనెలూరే నీ పెదవులమీద మురళిని మనోహరంగా మోపి, మోహన రాగాన్ని ఆలపించగా, మురళి కొసలో అందానికై కుచ్చుగా వ్రేలాడదీసిన సన్నని ముత్యాల సరాలు, అద్దాలలాంటి నీ చెక్కిళ్ళమీద ప్రతిబింబించినపుడు చూచిన రాధ, నిజంగా నీవు గానం చేసి అలసి పోవడంవల్ల పొటమరించిన చెమట బిందువులేమో ఆ ముత్యాల ప్రతిబింబా లని భ్రాంతిపడి, అలసట తీర్చుకోమని తానే నిన్ను ప్రక్కకు పిలచినది కదా!

వెన్నెల రాత్రి నీవు కడు
　　విందగు వాసవలీన చేతిలో
సన్నని వంశనాళము ప
　　సందుగ దాలిచి రాధ జేరగా
చిన్నెలు జూపు నూతన వి
　　చిత్రపు వేషము దాల్చి పోదు వే
పున్నెము జేసి కొన్నదిర!
　　పూర్వ భవంబున నామె యచ్యుతా! 76

అచ్యుతా!

నీవు వెన్నెల రాత్రిలో శరీరమంతా పరిమళ ద్రవ్యాలు అలదుకొని, నాజూకైన పిల్లన గ్రోవి చేతబట్టి, క్రొత్త సొగసులు సంతరించుకొని రాధా సమాగమానికై పోతున్నావు గదా! అంత శ్రద్ధగా ఆమెను కలసికోవడానికి ఆ రాధలో ఏదో ప్రత్యేకత ఉండాలి. ఆ ప్రత్యేకతను సంపాదించుకోవడానికి ఆమె పూర్వ జన్మల్లో ఎంతటి పుణ్యం చేసుకొన్నదో కదా!

మాటలు తీపి యౌనొ! కల
　　మాధురి గానము నందు నున్నదో!
సూటిగ జెప్పెనొప్పు కడు
　　సుందర రూపుడొ! ప్రేమ జాలమున్
వాటముగాను పన్నగల
　　పాండితి గల్గిన జాణ యౌనొకో!
ఏటికి? కృష్ణుడన్న పడి
　　యింతగ చత్తురు చారు లోచనల్? 77

ఆ గోపబాలుని...

మాటల తీయదనం వల్లనా? లేక గాన మాధుర్యం చేతనా? కాక అతడు చెప్పుకోదగిన సుందరాకారు డయినందు వల్లనా? ఇవేవీ కాక, 'ప్రేమ' అనే వలను నేర్పుగా వనితాలోకంపై విసరగల చాకచక్యం ఉండటం చేతనా?- దేని కోసమని అందగత్తె లందరూ ఆతనిపట్ల ఆకర్షింపబడి తమ సర్వస్వం అర్పించుకొంటున్నారు?

వేణువు నూదుచే కొదువ;
　　వ్రేతలు చేతలు దక్కి, యట్టులే
ప్రాణము మానమున్ ధనము
　　వానిదిగా, తనయంత తాముగా,
వేణు వినోది జేరి యట
　　వేడుక నాట్యము నల్పుచుండరే!
త్రాణ విహీనలై వశము
　　దప్పగ చిత్తము తత్తరింపగా! 78

ఆ వేణువినోది —

వినోదంగా మురళీస్వరాలు వినిపించడమే తరువాయి - గోపికలు చైతన్య శూన్యలై, మనసు వశముదప్పగా, తమ మానప్రాణాలు అతనివిగానే భావించి, తమకు తామే, తమకు తెలియకుండగనే ఆతని చుట్టుజేరి నాట్యంచేయ నారంభిస్తారు! ఆ చేష్టలన్నీ తమలో కలిగే అతీంద్రియమైన ఆవేశంవల్ల వారు చేసేవి!

నల్లని నీదు మేను గని
నచ్చిరి మెచ్చిరి నాతు లేలొకో!
నల్లని వన్నెలోనె కడు
నాణ్యత యున్నద? కాక కంతుడుఀ
నల్లగనుండు నంద్రుడు, రఘు
నందను డట్టులె! నీవు నట్టులే
యుల్లము పల్లవించు కడు
నొప్పగు రూపసు లైతిరేగదా! 79

కృష్ణా!

నీ శరీరం నల్లగా ఉన్నా, నవలాజనం నిన్ను మెచ్చి కన్నుల గప్పికొన్నారు! చూడగా నల్లందనంలోనే నాణెత ఉన్నట్టున్నది! లేకపోతే అత్యంతము అందగాళ్లని పేరుమోసిన మదనుడూ, శ్రీరామ చంద్రుడూ, ఇప్పటి నీవూ కూడ నల్లగానే ఉన్నారు కదా!

తీయని మాటలం దరయ
తేనియ యుండగ బోలు! కానిచో
హాయిగ నుండ జాలుదటె
యందరి భార్యల గట్టికొన్న నీ
వీ యిల నొక్క రిద్దరును
నెంతయుః వంతల గూర్చుచుండగా,
జాయల వేనవేల నవి
చారముగా నెటు కృష్ణ! యేలితో?! 80

కృష్ణా!

నీ మాటల్లో తేనెఉన్నది కాబోలు! లేక పోతే - ఈ లోకంలో ఒక్కరిద్దరు భార్యలున్న సంసారులే హాయిగా సంసారం చేయ లేక యిడుమల బడుతుండగా, వేలాదిగా అంతః పుర స్త్రీజనంతో నీ వేవిధంగా, నిశ్చింతగా కాపురం చేయగలుగు తున్నావు స్వామీ!

వెన్నెల తీప పంజరము
    వేడుక బంధన జేయ, వ్రేతలఁ
వన్నెల చిల్కబోదలకు
    వంశిని పాటల నేర్పువేళలో
కన్న మరుండు సిగ్గువడ
    కాయము లేమికి తృప్తినందు, నీ
చెన్నును, కన్నె చిల్కలును
    చిత్తొనరింపగ తన్ను, చిల్కనుఁ॥ 81

మురళీధరా!

నీవు వెన్నెల రాత్రిలో వేడుకకోసమై వెన్నెల తీగల పంజరంలో బంధింపబడ్డ గొల్లపడుచులనే చిలుక పిల్లలకు, పిల్లనగ్రోవిమీద పాటలు నేర్పుతున్న సమయాన, మన్మథుడు చూచి తనకు శరీరం లేనందుకు తృప్తిపడుతున్నాడు. ఎందుకనగా, నీయందం ముందు తన సౌందర్యం వెలవెలబోతున్నది! నీ కన్నె చిల్కల ముందు ఆతని వాహనమైన చిల్క విలువలేని దైపోతున్నది కనుక!

వెన్నెల వెల్గులప్పుగొను
వెల్గుల నవ్వుల పాలవెల్లి, నీ
వెన్నలు తిన్న మోవులను
వింతగ నుద్భవమంది సాగగా,
వెన్నను బుట్టుపాల కడు
విందుగ గ్రోలు మరాళగోపికల్,
మున్ను జనించి పాల, నిను
ముగ్ధుని జేసిన లక్ష్మికీర్ష్యగా! 82

గోపికాలోలా!

వెన్నెల వన్నెలను మించి వెలుగొందే నీ నవ్వులనే పాలసముద్రం - నీ వెన్నలుదిన్న పెదవుల మధ్యనుండి పుట్టి ప్రవాహ రూపమై వస్తుండగా, - పాలనుండి వెన్నలుద్భవించడమున్నది గాని, వెన్ననుండి పాలుద్భవించడం వింత కాగా - అట్టి పాలను హంసలైన గోపికలు ఆనందంగా ఆస్వాదించడం చూచి, అంతకు ముందెప్పుడో పాలసముద్రంలో పుట్టి నిన్నాకర్షించిన లక్ష్మీదేవి సైతం అసూయ పడుతున్నది సుమా!

పాట మెఱుంగులోన కడు
భాసిలు బృందవనము, బృందయంత నీ
మేటి మెఱుంగు మేను, నటు
మేనను దోచును బృంద–గాన నే
బోటియు నేర్పరింపదటు
పొందిన భ్రాంతిని కృష్ణ! లోకమే
పాటిది? తథ్య మిథ్యలవి
భాజ్యముగా నిను గాంచి కొల్వగన్! 83

కృష్ణా!

నీ పాట మెరుగులో బృందావనమంతా నీ కాంతివంతమైన తనువే కనిపిస్తుంటుంది! అలాగే, నీ శరీరంలో మరలా ఆ బృందకూడ ప్రతి ఫలిస్తూ వుంటుంది కనుక - నిన్ను వలచి నీ వెంటనుండే యువతీ జనమే నీ నిజరూపం ఏదో! ప్రతిబింబమేదో! గుర్తింపలేక భ్రాంతి చెందుతారట గదా! ఇక నీతో ఎక్కువ సాన్నిహిత్యంలేని లోకులెలా - నిజమూ - భ్రాంతీ - కలగలుపుగా ఉన్న నిన్ను తెలుసుకొని కొలువ గలుతారు?

జిలుగు వెలుంగు వెన్నెలను
చిత్తము నీ పయి జేర్చి కన్నులన్
వెలసిన మోద బిందువుల
వేడుక జూతురు నీదుమూర్తి, యా
నెలతలు–నిన్ను ప్రేమమున
నిక్కము దాచిరనంగ వేడ్కతో–
తలపులు స్వచ్ఛమైన భువి
తారసిలున్ సిరులున్నచోటనే! 84

యదుభూషణా!

వెన్నెల వెలుగు జిలుగులో ఆ అందగత్తెలు నీ మీద మనసునిల్పి; కన్నులలో ఆనందాశ్రువులు క్రమ్మగా - ఆ బాష్పబిందువులలో నీ రూపాన్ని అద్దంలో చూచినట్టు చూడగలుగుతున్నారు! అదెట్లున్నదనగా, వారు నీ మీద నున్న ప్రేమానురాగాలతో నిన్ను ఆ బిందువులలో దాచుకొన్నారా? అన్నట్లున్నది! నిజమే మరి. మనసు నిర్మలమైనదైతే, ఈ లోకంలో సంపదల కోసం వెంపరలాడుతూ పోనక్కర లేదు. అవి తామున్నచోటనే తారసపడగలవు!

గొల్లల తేఁడు రాఁడనఁగ
  కొమ్మల మాడ్చఁగఁబూనె వెన్నెలల్,
మెల్లఁగ సంచ రించుచునె
  మేనులు బల్వడఁకంగ, నూర్పులన్
వెల్లుగ వేఁడి గుప్పుటను
  వింతగ నేర్పడె నెండమావు లం
దల్లన వల్లవీ మృగము
  లానఁగ జూచెను ప్రేమ నీరమున్! 85

గొల్లలతేఁడు—

గోపాలదేవుడు ఇకవచ్చి తమను కలుసుకోడని తెలియగానే - చల్లగానున్న వెన్నెలలే యువతీ జనాన్ని మాడ్చివేయ నారంభించాయి! ఆ కన్నెలు విచారంతో వేగంగా నడవలేక, మెల్ల మెల్లగా సంచరిస్తూ, శరీరం వణకుతుండగా వేడి నిట్టూర్పులు గుప్పుతూ ఉన్నందువల్ల - అద్భుతంగా ఆ రాత్రి పూట ఎండమావులు ఏర్పడ్డాయి! అందులో గొల్ల పడుచులనే జింకలు ప్రేమమనే నీరాన్ని గ్రోలుతున్నాయి!

వ్రజ వనితా కుచంబులను
వాసిగ నుండిన కుంకుమంబు నీ
రజ నిభమైన నీదు పద
రక్తిమ నంటె; చరించువేళ నా
రజ మది సోక గడ్డియును
రాగ మయంబుగ, భిల్లకాంత లం
గజరుజ బాయదాల్తు, రది
కాంచిన వ్రేతలు వెచ్చనూర్చగా! 86

కృపా!

గోపికల మనసులనేగాక నీవు భిల్ల కాంతల మనసులను గూడ దోచుకొన్నావు! ఆ యాటవిక స్త్రీలు గొల్లపడుచులకంటె తెలివిగలవారు. ఎందుకనగా - వ్రేపల్లె యువతులు తమ వక్షస్థలంపైని కుంకుమ అడవిలో తిరుగాడే సమయాన గడ్డిపరకలకు తగిలి - ఆ గడ్డిపోచలు ఎఱ్ఱగా మారగా, ఆ గడ్డిపరకలనే తమ తాపం తీరేటట్లు వారు అలంకారంగా ధరిస్తారు! అది చూచిన వ్రజకాంతలు అసూయతో నిట్టూరుస్తారు!

నీ కుటిలాలకల్ చెదరు
 నెమ్మొగ మెప్పుడు చూడగోరు మా
కీ కను రెప్పలేల విధి
 నీ విధి నడ్డుగ గూర్చెనో కటా !
ఆ కను రెప్పపాటయిన
 నాగుట యెట్లయ కృష్ణ! చూడకన్
ఆ కఠినాత్ము బ్రహ్మ నిక
 నాగుట యెట్లొకొ నిందసేయకన్? 87

కృష్ణా!

వంకరలు దిరిగి నీ ముఖం మీదపడున్న ముంగురులతోడి అందాలుచిందే నీ సుందర వదనాన్ని మేము కనురెప్పపాటయినా ఎడతెరపి లేకుండా చూడగోరుతుండగా, దయలేని బ్రహ్మ మాకళ్ల కడ్డుగా ఈ రెప్పలెందుకు ఏర్పాటు చేశాడో కదా! ఆరెప్ప పాటయినా నిన్ను చూడకుండా ఉండటమెలా? ఈ రీతిగా కనురెప్పల తెరలతో నీ దర్శనానికి ఆటంకం కలిగించిన విధిని నిందించకుండటం మాత్రమెలా?

విరహము నోర్చలేముగద
వేణు వినోది! మనోజరుగ్మతన్
మరణమె నిశ్చయంబయిన
మాన్యులు నీ గుణగానమన్ సుధన్
విరివిగ మాకుబంచి, మృతి
విస్మృతి నంపగ జేసిరే కదా!
దరిసెనమైన గూర్చి యిక
ధన్యుల జేయగరాదె మమ్ములన్! 88

ఓ వేణు వినోదీ!

నీ విరహాన్ని భరించ లేక మన్మథ వ్యాధి తీవ్రత చేత మేము మరణించటానికి నిశ్చయించుకున్నపుడు, భక్తులు కొందరు నీ స్తుతులనే సుధలు మాకు పంచి, మరణాన్ని గూర్చిన ఆలోచననే మరచిపోయేలా చేశారు! అసలు అమృతపానం చేసిన వారికి చావు లేదు గదా! కనుక - ఆ చావుకైన నోచుకోలేని మాకు నీ దర్శన భాగ్యాన్నైనా యిచ్చి ధన్యులను చేయరాదా? - (అని వేడుకొంటున్నారు కొందరు విరహిణులు!)

పిల్లలు నీడజూచి కడు
　　ప్రేముడి నాడెడు రీతి కృష్ణ! యీ
గొల్లల వాడలోని ప్రజ
　　కోమలి సంఘముతోడ నాడెదా?
అల్లరి చూపులన్ హృదయ
　　మందున సోకిన వ్యాధి పోవునా?
ఉల్లము పల్లవింప మము
　　నొద్దిక కౌగిట దన్పకుండినన్। 89

కృష్ణా!

చిన్నపిల్లలు తమ నీడను జూచి తాము ముచ్చట పడి, ఆ నీడతోనే ఆడుకొంటూ వుంటారు. అలాగే నీవు నిను వీడని నీడలా వెన్నంటి తిరిగే గొల్ల పడుచులతో వినోదించినంత సేపు వినోదించి, మరల వారిని గూర్చి ఆలోచించడం మానివేస్తావు! వారు నిన్ను తమ వాడవని నమ్మి మనోజ వ్యాధి పీడితులౌతున్నపుడు మరిన్ని అల్లరి చూపులతో వారిని వేధించకపోతే, వారి హృదయాలు పులకరించి, ఆశల చిగుళ్ళతో ఆనందడోలల ఊగిస లాడేటట్లు - వారిని కౌగిలింతలతో తృప్తిపరచి - ఆ వ్యాధినుంచి వారికి విముక్తి కలిగించరాదా?

పసులను గాయ నేగుదువు
పావనమౌ పద పంకజంబులన్
గసిక శిలల్ ః తృణంబులును;
కంటక జాలముగాడ కుండునా?
మిసిమి మిటారి వక్షముల
మెత్తిన యంతకె కందు పాదముల్
పొసగున నిష్ఠురంబయిన
భూమిని ద్రొక్కగ? కృష్ణ! నిల్వుమా ః 90

## ఓ గోపాల కృష్ణా!

గోవులను కాయటానికి అడవికి పోతున్నావా? వెళ్ళకు! కొంచం ఆగవయ్యా! నీ పవిత్రమైన, మృదు పాదపద్మాలు యువతీ వక్షోజాలతో మెత్తినందుకే కందిపోతాయి గదా!? అలాంటి పాదాలకు అడవిలోని కఠిన శిలలూ, వాడిగా నున్న గడ్డిపోచలూ, ముళ్ళూ మొదలైనవి గ్రుచ్చుకొంటే ఎలా? నీ పాదాలు మెత్తగా, నిరపాయకరంగా ఉన్న భూమిమీద మాత్రమే మోపదగినవి! కనుక అడవికి పోకు!

కన్నని పూర్వజన్మముల
గన్నను కంపిత మౌను దేహముల్
తన్ను వరింప వచ్చెనని
తన్వి యొకర్తె గురూపి జేసె! నా
పన్నుని గావనంచు నటు
వాలిని కోలను గూల్చె నిర్దయుఁ!
మన్నిక దానమివ్వ బలి
మస్తకమందున నూనె పాదముఁ! 91

కృష్ణునితో—

ఎడబాటు దుర్భరం కాగా-ఆతని నిర్దయ నిలా నిరూపిస్తున్నారు గోపికలు! "కృష్ణుని పూర్వ జన్మలనూ, అప్పటి కొన్ని కృత్యాలనూ తలచు కొంటేనే భయమౌతున్నది! తనను వరింప వచ్చిన ఒక కాంతకు ముక్కూ చెవులూ కోయించి కురూపిని చేయించాడు. ఒక ఆప్తుని కాపాడటం కోసం మరొక మహావీరుని వాలిని, చాటునుండి బాణంతో కొట్టి చంపాడు. తన్నె రిగికూడ దానమిచ్చిన బలినెత్తిన పాదముంచి పాతాళానికి త్రొక్కివేశాడు." (అలాంటి నిర్ద యుడు నమ్మిన వారి బాధమాన్పరాడని వారి భావన!)

ఆకట పండులం బొడిచి
యావలి కేగును చిల్క వెంటనే,
తాకిన పండ్ల వేమగునొ
తాను గణింపదు కొంచమేనియుఁ,
ఆ కరివేల్పు కోర్కెలకు
నర్పిత మైనటువంటి మమ్ములన్
సాకత మింత లేక తుది
సంగతి వీడుట నట్టి దాయెనే! 92

గోపాలుడు—

ఒకప్పుడు తమతో ఆడి, పాడి, తరువాత మరచి పోయాడనే విచారంతో గోపిక లిట్లంటున్నారు! అయ్యో! ఆ కృష్ణుని కోర్కెలకు అనుకూలంగా మమ్మ మేము అర్పించుకొని అన్యాయమై పోయాము గదా! మా స్నేహానికి సార్థకత లేకుండా, ఆతడు ఆకలిగొన్న చిలుక తన కిష్ట మైన ఫలాలను కొరికి కొరికీ విడచిపెట్టిపోతూ (-ఇలా కొరికి విడచిన ఫలాన్ని మరెవ్వరు భక్షిస్తారనే ఆలోచన లేకుండా తన పని తాను చేసుకుపోయినట్టు -) చేసిన స్నేహాన్ని సగంలో తెగ తెంపులు చేసుకుపోగా, ఆ చిలుక కొరికిన పండ్లగతి అయ్యాము గదా?! (చిలుక యోగ్య మైన ఫలాలనే కొరుకుతుంది. కృష్ణుడు యోగ్య మైన స్త్రీ రత్నాలను చేరదీశాడు!)

మృగయుని గాన మోహమున
మచ్చిక జేరిన లేళ్ళ రీతిగా,
సొగసుల సోయగాల సిరి
చూపుల మాధురి చుట్టుజేరు నీ
మగువలు గూలుచుందు రిల
మన్మథ మార్గణ సారణమ్మునన్
విగళిత బాష్ప బిందువుల
వెచ్చగ నూర్చి, క్షతాల జూచుచున్. 93

కృష్ణా!

వేటగాడు లేళ్ళను పట్టుకోవడానికి ఏవో శబ్దాలు చేసి, నమ్మకం కలిగించి, అవి దగ్గర చేరగానే చేజిక్కించు కొన్నట్టు; నీవుకూడా నీయంద చందాల వల విసిరి, చూపుల సూదంటురాళ్ళతో ఆకర్షించి, నీవు లాలించగలవు, పాలించగలవని నీ చుట్టూ చేరిన యువతులు, కన్నీరు విడుస్తూ, గోటిగాయాలు చూచుకొంటూ, మన్మథ ధాటికి కూలి విలపించేలా చేస్తావు! నిర్దయుడైన వేటగానికీ, నీకూ ఏమిటి భేదం?

మమ్ముల సేదదేర్చి, సిరి
 మానస చోరుని జేర్పజూతువా?
వమ్మగు నీ ప్రయత్నములు
 బంభర! వానిని యొంటిగాను నే
కొమ్మలు చేరలేరు, తన
 కూరిమి కొమ్మను గూర్చె ఱొమ్మునన్!
పొమ్మిక మాకు వ్రాసెవిధి
 పొక్కుచు, చొక్కుచు నుండ మేమిలన్. 94

ఓ తుమ్మెదా!

మా చెవుల దగ్గర గీ పెట్టుతూ, ఏవో ప్రణయ సందేశాలు అందించినట్టు ఎందుకు తిరుగుతావు? నీవు ఏదో చెప్పి, మా మనసులను కుదుట పరచి ఆ లక్ష్మీవల్లభుని చెంత చేర్చాలను కొంటున్నావు. అయితే నీ ప్రయత్నం ఫలించదు. ఎందుకంటావా? ఆ స్వామిని ఏ ప్రేమికురాలు కూడ ఒంటరిగా కలుసుకోజాలదు. తన కిష్టమైనదని ఆ లక్ష్మీదేవిని ఆతడు గట్టిగా వక్షస్థలం మీదనే కూర్చుండ బెట్టుకొన్నాడు కదా! అందుచేత మాకీ విరహబాధ విధి నిర్ణయమే-సుమా!

మా యిరుకైన మానసము
మాధవుకై వెలివీయ జొచ్చి, యా
పోయిన మాధవుండు నటె
పొందుగ నుండె త్రిభంగి రూపుడై.
మాయలు పన్ను మాధవుడు
మమ్ముల గోరెను విస్మరింపగా.
కాయము బోవకున్న నది
కాదని తానెఱుంగుం గడుంగడుఁ. 95

మాధవుని—

మరువజాలని గోపిక లిలావాపోతున్నారు. 'ఆ మాధవుడు మిక్కిలి మాయకాడు! మమ్ము వలచినట్టు వలచి, వలపించుకొని మరల తన్ను మరచి పొమ్మంటున్నాడు. మా మనసు అసలే ఇరుకైనది! అందులో ఈయనకు మాత్రమే సందిచ్చి ప్రవేశపెట్టాము. లోనికిపోయిన ఈ మాధవుడు మూడు వంపులుగా తిరిగి అక్కడే నిలచుకొని ఉండిపోవడంచేత ఇక బయటికి రావాలన్నా సాధ్యంకాదు. ఆపని ఈ శరీరం ఉన్నంతవరకూ చేయరానిదని ఆ మహానుభావు నికే చక్కగా తెలుసు!'

కలువల తేనితో గలసి
కాంతునికై విలపించు మమ్ములన్
కలువచెలీ! హసింపకుమ!
కాముని వింటికి నెక్కబోకుమా!
తులువ తనాన నవ్వినను
దూషణ చేయమె నిన్ను, నీ విధిన్
చెలుని వియోగ దుఃఖమున
చేడ్పడ కీడ్పడ జాలి దూల్పడన్! 96

కృష్ణ వియోగంతో—

ఉన్మాదినులైన గోపికలు కలువతో అంటున్నారు. 'ఓ కలువ చెలీ! చంద్రునితో నీవు కులుకుతూ, వెన్నెలరాత్రి విరహంతో విలపిస్తూ తపిస్తున్న మమ్మల్ని చూచి నవ్వకు. నీవుకూడ మన్మథుని బాణాల్లో ఒక దానివి కనుక, మమ్మల్ని వేధించడానికి ఆ మదనుడు ఎక్కుపెట్టే వింటి మీదికి ఎక్కకు! మా బాధను చూచి నీవు పరిహసించావంటే - అసలే ప్రియునెడబాసి దయనీయ స్థితిలో ఉన్న మేము నిన్నూ, ఆ బ్రహ్మను కూడ తప్పక నిందించవలసి వుంటుంది!'

మాటలు రాని తెప్పలను
　　మాటికి మాయల పన్ని పట్టుచున్,
పాటలు పాడు వంశిరవ
　　పాండితి భామల మెప్పునొందుచున్,
కోటి శశాంక చంద్రికల
　　గుప్పెడి నవ్వుల ముంచి తేల్చుచున్,
తేటి మెఱుంగు ముంగురుల
　　తీయని మోమును జూపు మాధవా! 97

మాధవా!

భావ రాని కనురెప్పలతో ఏవో చిలిపిబాసలాడి మగువలను వలలో వేసుకొంటూ, మురళినూది చక్కగా పాటలు పాడి వారి మెప్పును పొందుతూ, కోటి చంద్రుల కాంతులను నీ చిరునవ్వులో చిందిస్తూ, ఆ నవ్వుల పరవశంలో చూపరులను ముంచెత్తుతూ, నల్లగా, తుమ్మెదల మెరుపులాగా ప్రకాశించే ముంగురులతో చూడ ముచ్చటగొలిపే నీ తీయని ముఖాన్ని మాకు చూపవయ్యా!

కోటి వసంత శోభ లోక
  కోవను గాంచిన సొరుదోప, నీ
మేటి మెఱుంగు మేని పస
  మేము కనుంగొన చాలవే కనుల్ !
ఏటికి బ్రహ్మ వ్యర్థముగ
  నిన్నిటి రోమము లిచ్చెమేన ? నా
చోటుల కన్నులున్న నిను
  చూడగ వచ్చును గాదె తృప్తిగా ! 98

కృష్ణా!

కోటి వసంత శోభలను ఒక్క-చోటనే చూచిన అందాలు నీ శరీరశోభలో, కాంతిలో ఉన్నాయి కనుక-మాకున్న యీ రెండు కళ్ళతో ఆ దివ్య శోభను చూడలేము. ఆ బ్రహ్మ శరీరమంతా పనికిరాని రోమాలను కోట్లకొలది మాకివ్వక పోతే వాటిస్థానంలో కన్నులనే మాకిచ్చివుంటే నిన్ను తృప్తిగా చూచుకొనే వారముగదా!

మొయిలువు నీవుగా, మెఱవు
ముచ్చట రాధగ; చంద్రు డీవుగా;
హాయలున రాధ చంద్రికగ;
హోరను నా యమునా తరంగముల్
లయలిడ, మీరుచేయు మృదు
లాస్య మభిన్నము గాగ నొప్పగా,
మెయి పులకల్ గదుర్ప భువి
మేల్కని ప్రాణులు గాంచు స్వప్నముల్! 99

కృష్ణా!

నీవు మేఘమైతే అందుపుట్టి మెరిసే మెరుపే రాధ! చంద్రుడివి నీవైతే రాధే వెన్నెల! యమునలోని అలలహోరు మీ రాధాకృష్ణులు చేసే శృంగార రసోద్దీపకమైన లాస్యానికి సరి పడే లయ లందివ్వగా, ప్రకృతీ పురుషుల ఐక్యతకు చిహ్నమైన మీ చేతల్ని, పులకరింతతో మునిగిన ప్రాణికోటి మెలకువలోనే స్వప్నాలని గాంచినట్టు గాంచి పరవసిస్తుంది!

ఎన్నడు గాంచురా పృథివి!
యెప్పుడో చూచిన నీదుక్రీడ లిం
కెన్నడు పేర్చురా యమున
యింపగు సైకత శయ్యనీకు, నిం
కెన్నడు చేరు రాధ నిను
నీప్సితముల్ ఫలియింప నొంటిగా,
ఎన్నడు మ్రోగు వేణు వటు
లీధర తాపము దీర మాధవా!? 100

మాధవా!

నీ యవతార మనేది గతవైభవం! దాన్ని చూచే భాగ్యం మాకు లేదు సరికదా, ఈ భూదేవికే ఆ యనుభూతి మరల లభించటం కల్ల! మరొకసారి యీ వసుంధర నీ క్రీడలు చూడగలదా? యమునా నది నీకు మనోహరమైన మెత్తటి యిసుక పాన్పులు సవరించగలదా? రాధ ఒంటరిగా కోర్కెలు ఫలింపగా మరల వచ్చి ఆ పులిన భూముల్లో నిన్ను కలువగలదా? మరల నీ వేణువు—ఈ పృథ్వీ తాపాన్ని పోగొట్టగలిగినట్లు మ్రోగగలదా?!

రాధకు ప్రీతిగా చెలిమి
రంజిల శారద రాత్రులందు బిం
బాధరముల్ స్రవించు మధు
వాగ్ఝరి ముంచుమ! వేణు మాధురల్
బాధను బాప, మోహమున
బ్రబ్బిన కోర్కెల నిన్నుజేర, నీ
రాధకు మెప్పుగూర్చు నొక
రాగము నచ్యుత! యాల పింపుమా! 101

రాధాసక్త రసికాగ్రచిత్తా!

నీవు రాధ సంతోషానికై శరద్రాత్రులందు పెదవులు కదిపి స్రవింపజేసే తేనె మాటల ప్రవాహంలో మమ్ము తేలియాడించు! ఆ వేణు మాధురి మా బాధను తొలగింపగా క్రమ్ము కొన్న కోర్కెలతో నిన్ను చేరడానికి రాధను మెప్పించే ఏ రాగాన్ని ఆలపించి పిలిపించే వాడివో, ఆ రాగాన్నాలాపించి మమ్మల్ని పుల కింపజేయి!

ప్రేమ పరీక్ష జేయుటకు
  వేడితి రాధను పెద్ద ముత్యమున్,
ఆమె తిరస్కరింప నది
  అమ్మ యశోదయె పంపె నీకుగా;
ఆ మహనీయ ముత్యమున
  నల్లితి ముత్తె సరాల పందిరుల్ !
రామలు వేలుగొల్వ నట,
  రాధ కనుంగొని సిగ్గు జెందగా! 102

మాధవా!

రాధిక ప్రేమను పరీక్షించడానికి ఆమెదగ్గరున్న ఒక గొప్పముత్యాన్ని తెమ్మని పంపగా ఆమె నిన్ను చుల్కన జేసి 'ఆ గోపాలునికింత విలువైన ముత్యమెందుకట? ఇవ్వడానికి కాదు' అని చెప్పి పంపగా, అంతకంటే విలువైన ముత్యాన్ని తరతరాలుగా దాచుకొన్న దానిని మీయమ్మ యశోద నీకు పంపినది. ఆ ముత్యాన్ని ఆధారంగా అద్భుతమైన ముత్యాల పందిరులెన్నో నీవు అల్లి ఒక బృందావనంలాంటి విహార భూమిని సృష్టించగా అందు ప్రతి పొదరింటి లోను రాధను మించిన అందగత్తెలు నిలచి నిన్ను ఆరాధిస్తుండగా-చూచిన రాధ సిగ్గుతో తలదించుకొంది గదా!

చందురు వెల్గు చాటునను
చక్కగ నవ్వెడు మల్లె పందిరిన్
సుందరిగా భ్రమించినది
సుమ్మ! వనాంతర రాధ యీసునన్.
'ముందుగ వచ్చి మాధవుని
ముద్దును దీర్పగ నున్న యంతలో
నిందుల పుష్ప బాణముల
నెవ్వతె? రాల్చుచు నున్నది'ట్లనున్! 103

కృష్ణుని—

కలుసుకోవడానికి ఏకాంతంగా వనానికి వెళ్ళిన రాధ, వెన్నెల వెలుగులో చక్కగా కనుపించని, విరిసిన పూలతో విలాసంగా నవ్వుతున్న మల్లె పందిరిని చూచి మరొక సుందరిగా భ్రమించి, అసూయ చెందింది. ఎవ్వరికీ తెలియకుండగ, మునుముందుగా వచ్చి మోహనుని మురిపించ వచ్చుననుకొన్న నాకంటె ముందుగా ఈమె యెవ్వతె? ఇక్కడికి వచ్చి ఆనందాశ్రువులు రాలుస్తున్నది! అని యనుకొన్నది.

రాధయు గృష్ణుడుం గలరు
రమ్య తరంబుగ నాది మూర్తులై,
'రాధ'ను నక్షర ద్వయము
రామల నల్వుర దెల్పు చిహ్నమౌ;
రాధను 'రా'యె 'లక్ష్మి' యగు,
రంజిలు 'ధాత్రి' 'ధ' కారమౌ, నటుల్
బోధన జేయు నా 'విరజ'
పుణ్య లలామల'లీల''నా'క్షరాల్ ! 104

గోలోకాన—

ఆది దైవతాలై 'కృష్ణుడు - రాధ' - అనే పరమ పురుష, పరమ శక్తులున్నారు. వారే వివిధ నామ రూపాలతో వివిధ దేవతలుగా, వివిధ కల్పాలలో, యుగాలలో ప్రవర్తిల్లారు. వారిలో స్త్రీ శక్తి 'రాధా' నామధారిణి. అందులో 'ర' అనే అక్షరం లక్ష్మి - అనీ, 'ధ' ధరిత్రి అనీ, 'రా' లోని ఆ - కారము ఆది గోపి 'లీల' అనీ, 'ధా' లోని ఆ - కారము 'విరజ' అనీ, ఈ తీరుగా స్వామి తేజము నాలుగు మార్గాలై లక్ష్మి, భూమి, లీల, విరజ - అనే పేర్లతో 'రాధ'లో లయించిందనీ, ఈ వివరణ - సామ మార్గంలో - గంధమాదన పర్వతస్థుడైన స్వామి నోటినుంచే వినవచ్చినదనీ - గర్గవచనం!

నందుడు బాలుడైన తన
  నందను రాధకు నివ్వగా, శతా
నందు డొనర్చె పెండ్లిని. ఘ
  నంబుగ దేవత లర్చ సేయగా
నందు, నికుంజ రాధ తన
  యర్భక భర్తను బొందె చాటుగా.
బంధులు లేని పెండ్లి యది
  భావిని నిందల దెచ్చె స్వామికిన్! 105

గర్గముని—

ఆదేశానుసారం నందుడు బాలుడైన కృష్ణుని యమునా తీరంలో భాండీర వనానికి తీసుకొని పోగా, భయంకరమైన వర్షం పట్టుకుంది. అప్పుడే రాధ భగవచ్ఛాదేశానుసారం అక్కడికి రాగా, నందుడామెకు నమస్కరించి బాలునిచ్చాడు. బ్రహ్మ, దేవతల సమక్షంలో రహస్యంగా పొదరింటనే రాధాకృష్ణులకు వివాహం చేశాడు. ఆవిధంగా బంధువులూ, విందు భోజనాదులూ లేని రాధాకృష్ణుల వివాహం-ఆతర్వాత వివాదాస్పదమై, ఎన్నో నిందలకు కారణమైంది?

ఆ యమునా ధునీ విలస
　　దద్భుత నీప వనాంత రంబునన్
తోయజ పత్రనేత్రు డొక
　　తీయని గీతిక వంశి నూదగా,
పోయిరి మూర్ఛ నంతికవు
　　పుణ్య పురాంగన లంచు, రాధకున్
ఆయమ నెయ్యురాం డ్రొసగి
　　రా కథ చిత్రముగాగ గీచియుఁ౯,, 106

రాధ చెలులు—

విశాఖ, లలితలు - మాధవుడు యమునా తీరంలో. వేణుగానం చేయగా వృషభాను పురం లోని (రాధ నివశించే పట్టణం. రాధ తండ్రి వృషభానుడు) వనితలందరూ మూర్ఛపోయారనీ చెప్పగా, రాధ వారిని విశేషాలడిగింది. అందుకు సమాధానంగా ఆ చెలులు అక్కడ జరిగిన విశేషాలన్నిటినీ ఒక చిత్రంలో చిత్రించి ఆమె కిచ్చారు.

బొమ్మను గాంచి రాధికయు
పూర్ణ మనోగత పూర్వ రాగముల్
కమ్మగ గ్రమ్మ భావమునః
గాంచెను క్మ్కారియు నట్టి స్వప్నముల్
ఇమ్ముగ మేలుకాంచి, హృద
యేశు నెడాటము నోపలేక, నా
కొమ్మ వనంబు జొచ్చియిటు
కూయిడు చుండును నీల వర్ణుకైః 107

ఆ చిత్రాన్ని చూచిన రాధ—

గడచిపోయిన మధురమైన సంఘటనలను తలచు కొని, నిద్రించి స్వప్నంలో అలాంటి అనుభూతులే పొంది. మేల్కాంచి అటుపై తనప్రియుని యెడ బాటును ఓర్వలేక పరిసరవనానికి పరువెత్తి ఆ నీల మనోహరుని కోసం అనేక విధాలుగా విల పింప నారంభించింది.

తుమ్మెద లార ! తేనియల
తీయని పానక మట్లు గ్రోలుటన్
దొమ్మిని చేయుచుంటి రిది
తొయ్యలి మోమను తెల్వి లేమిచే.
కొమ్మల మోవి తేనియల
గ్రోలెడు నల్లనివాడు తుమ్మెదై
రమ్మనె రాధ నిచ్చటికి.
రాగల డెప్పుడొ ! పొండు శీఘ్రమే ! 108

ఓ తుమ్మెదలారా !

తీయని పానకంలా పూదేనెను ఎక్కువగా త్రాగినందువల్ల మత్తెక్కి ఇది పద్మమా ? లేక స్త్రీ ముఖమా ? అని తెలియక నా ముఖంపైకి దుర్మార్గంగా దాడి చేస్తున్నారు ! మదవతుల మోవి తేనెలను మృదువుగా త్రాగే నల్లని గండు తుమ్మెదలాంటివాడు 'రాధ'నైన నన్ను ఇచ్చటికి రమ్మని సూచించాడు. అత డేక్షణంలోనైన రావచ్చును ! కనుక మీ రెల్లరిమాని వెంటనే వెళ్ళిపొండి.

కప్పుర ధూళి రేగినటు
  గ్రమ్మిన వెన్నెల వన్నెకాని నే
నిప్పుడు చేర వచ్చితిని,
  ఎచ్చటి కేగెనొ వాడు తెల్పరే!
ఒప్పుల కుప్పలార! సుమ
  నోత్కర సుందర మూర్తులార! తా
కొప్పున పింఛమున్న కటి
  గొల్లని వృక్షములార! చూడరే! 109

కర్పూరపు ధూళిలా—

వ్యాపించిన ఈ పండు వెన్నెలకాంతిలో, అంద గాఢైన నా ప్రియుని కలుసుకోవడానికి నేను వచ్చాను. వాడిక్కడ కనుపించడం లేదు. ఎక్కడికి కెళ్ళాడో యేమో! పూలసిరులతో అందాలొలికే సుందర మూర్తులారా! ఓ వన వృక్షములారా! శిరసున నెమలి పింఛం దాల్చిన ఆ వల్లని గొల్లపిల్ల వానిని చూడలేదా మీరు?

నోరెడు మోవి తేనె గ్రోని
నూరు వరాలను బొంది నట్లుగా
ఊరట జెందు రాధ నిటు
లూరక మోహను డేచు నేలొకో!
కోరను పారిజాతమును,
కోరను పట్టపు రాణివాసమున్,
కోరని కోర్కెలైన, గని
కూరిమి దీర్చెడు స్వామి యేమయెన్? 110

ఒక్కసారి—

నోటికి నిండుగా అధరామృతాన్ని గ్రోలి అదే నూరు వరాలుగా భావించి తృప్తినందే రాధను, ఈ మోహను డెందుకు ఏడిపిస్తున్నాడో మరి! నేనాయనను సత్యభామలాగ పారిజాతం కోసం వేధించానా? లేక రుక్మిణివలె పట్టమహిషీత్వం కావాలన్నానా? ఏ కోరికా కోరకున్నా మన సెరిగి మన్నించే మాస్వామి ఈ నాడెందుకో ఇటకు రాడాయెను? ఏమైనట్టు!

ఓ కరుణామయీ! వసుధ
    ఓర్తు వదెట్లు వసంత రాకకై?
నాకును దెల్పు మర్మమది
    నాథు నిరీక్షణ జేతు నోర్మిమై;
నీ కథ వేరు లెమ్మతడు
    నిశ్చిత కాలము లోన వచ్చెడున్,
ఈ కళివేల్పు రాకలవి
    యెప్పుడొ! యెవ్వరు చెప్పరానివౌ! 111

ఓ దయామయీ!

భూదేవీ! ఈ రాధ నాథుని కొఱకు ఓర్పుతో ఎదురు చూడలేక పోతున్నది. నీవు ఎప్పుడో రాగల ప్రియుడు వసంతునికోసం ఎంతో ఓర్పుతో ఎదురుచూస్తుంటావు! అందులో మర్మమేదో నాకు తెల్పవా? అసలు నీవు నీ ప్రియునికోసం ఎదురు చూచేవిషయం వేరు, నా ప్రియుని కథ వేరు. నీవాడు నిర్ణీత కాలానికి తప్పక వస్తాడు కనుక ఓర్పుతో ఎదురుచూస్తావు. నా విషయమలా కాదుగదా! ఆ కృష్ణుని రాక ఎప్పుడో ఎవరూ చెప్పలేరు!

ఒక్కడె రాధ మానసము
నొప్పగ దోచిన వన్నెకాడు, తా
నొక్కడె వేల గోపికల
కున్న విశేష ధనంబు కావునన్,
చక్కని నా మనోహరుడు
సారస నేత్రల కన్నుగప్పి, యీ
చక్కికి వచ్చునేమొ! కడు
సద్దు మణంగిన వేళ చూచెదన్ 112

ఈ రాధ—

మనసును దోచుకొన్న వన్నెకాడు ఆ మాధవు డొక్కడే! వేలకొలది గోప కాంతలకున్న పెన్నిధి కూడ ఆత డొక్కడే! కాబట్టి, ఎప్పుడో సద్దు మణగిన వేళ! ఆగోపికలందరినీ ఏమరిచి, నా మనోహరుడు! నన్ను చేరగా రావలె! అంత వరకు ఆతనికొఱకు వేచి వుండక తప్పదు.




శూర్పణఖ రాగము వ్యర్థ్యముగాగ...పూర్వజన్మలో...
కుబ్జ కటిసీమను బట్టి విదిల్చి...చక్కని రూపమిచ్చితివి
సారస లోచన-ఈ భవంబులో! (పుట-34)

మనమున గుప్తమై యెసగు
　　మాధవు డిచ్చిన యా బహూకృతుల్
ఘనముగ జమ్మివృక్ష మది
　　గర్భము నందున దాల్చు నగ్నిగా;
పనివడి రాధ వానికయి
　　వచ్చిన నబ్బక వాని కూటముల్
వనము దహించు దావశిఖ
　　ఖాతిని నేర్చెను మోహ తాపముల్ ॥ 13

మాధవుడు:—

రాధకిచ్చిన బహుమాన రూపమైన తీయని గుర్తులు ఆమెమనసులో-జమ్మివృక్షంలో దాగిన అగ్నిలా-గుప్తమై వున్నాయి! ఇప్పుడు రాధ ఆతనికై పనిగట్టుకొని ఏకాంత స్థలానికి రాగా, ఆతని కలయిక లభించక పోవడంచేత రేగిన మోహతాపాలు అడవిని కాల్చడానికి చుట్టు ముట్టివచ్చే దావాగ్ని శిఖల్లాగా - ఆమెను ఆవరించి వేధిస్తున్నాయి!

సాగరు నంబరుం గలుతు
చాలక నా మధుమూర్తి రాకకై
వేగుదువే మహీ! విరహ
వేదనతో కృశియించి పోదువే!
రాగము భోగ మేదయిన
రాధకు నొక్కడె మాధవుం డగుణ్,
రాగల డంచు చూచెదను.
రాతిరి వేగిన రాధ లేదికన్! 114

ఓ ధరిత్రీ!

నీ ప్రియులైన సాగరుని, అంబరుని నిరంతరం కలిసి ఆనందిస్తూకూడ, వసంతుని కోసం మరల ఆరాట పడుతుంటావు! ఆతడు మరుగు కాగానే కృశించి పోతావుకూడ కదా! నాకున్న ప్రేమ, అనుభవం, ఆనందం అన్నీ ఆమాధవు నొక్కని తోడనే! ఆతడు రాగలడని ఎదురుచూస్తున్నాను. తెల్లవారే దాక ఎదురుచూస్తాను. అప్పటికీ రాకపోతే ఇక రాధకూడ ఉండబోదు.

కలువల జేని గాంచినను
　　కాంతుడె నా స్మృతివోచు - తారకల్
కొలువగ గుల్కు చుండునటు
　　కూరిమి నా సయిదోడు - వేడుకన్
చెలువలు చుట్టుముట్టి, నను
　　చేరగ రాడని యూహ సేయుదున్;
కొలుతును మేఘమా! శశిని
　　కొంచము గప్పుము, నీకు పుణ్యమౌ! 115

కలువల ఱేడైన...

ఈ చంద్రుని చూడగానే నాప్రియుడే నాకు జ్ఞప్తికి వస్తున్నాడు. ఎందుకనగా, వేలకొలది తారకలు తనను చుట్టిసేవిస్తున్న ఈ చంద్రుని లాగే, నాప్రియుడు కూడ ఎందరో ప్రియ రాండ్రు తనను చుట్టుముట్టి రానివ్వనందువల్లనే ఆలస్యం చేస్తున్నాడని భావిస్తాను. కనుక; మేఘుడా! ఆ చంద్రుని నాకు కనిపించ కుండగ కప్పివేయి. నాసఖుడు రానందుకు కారణం వేలకొలది సపత్నులనేభావం కలిగించే యీ చంద్రదర్శనం లేనంతసేపు ఊరట చెందుతాను. ఆపుణ్యం కట్టుకో!

వెన్నెల వెల్గు లేనియెడ
  వెన్నుని తెన్నున నుందు మేఘుడా!
వెన్నెల వేడి నావలెనె
  వింతగ వాడి వివర్ణు డైతివో!
కన్నుల కద్దుకో గలుగు
  కన్నని వన్నెల నుండువాడ వీ
వెన్నెలతేని చేతగద ?
  వెల్వెల బోవుచు నుంటి వక్కటా! 116

ఓ మేఘుడా!

ఈ శరత్కాలపు చిక్కని వెన్నెల లేకపోయిన ట్లతే నీవుకూడ నా ప్రియునిరంగుతో నల్లగా, చూడ ముచ్చటగా ఉండేవాడవు! ఈ వెన్నెల వేడికి నావలె నీవుకూడ వాడిపోయి, వివర్ణుడివై పోయావుగదా పాపం!

పెదవుల నానబోవు నెడ
　　పీడిత పూతన నా మనంబునన్,
కదిసి కవుంగ లించుతరి
　　ఖండిత సాలము లంతరంబునన్,
మెదల హిరణ్య కశ్యపుడు
　　మెచ్చుగ శౌరియు నన్నుగిల్లబోన్,
వదలినదాన వెఱ్ఱినయి
　　వల్లభు, నిప్పుడు పొందుటెట్లొకో! 117

అయ్యో! నా ప్రియుడు...

శౌరి, నా పెదవులను పానం చేయడానికి సమీపించి నపుడు, పూతన గుర్తుకువచ్చి - ఆమెకు ప్రాణహాని చేశాడనే భయంతో - వారించాను. కౌగిలింపబోయినపుడు మద్దిచెట్లు నుగ్గైన వృత్తాంతం జ్ఞప్తికివచ్చి భయంతో తప్పుకొన్నాను. గిల్లబోయినప్పుడు - ఆగోళ్ళతోనే హిరణ్యకశిపుని చీల్చాడనే భావన మనసులో మెదిలి అడ్డుకొన్నాను. ఆ విధంగా, దగ్గరైన స్వామినప్పుడు విడచిపెట్టి, వెఱ్ఱిదాన్నయి. ఇప్పుడు విలపిస్తున్నాను!

పరమ వరాహ రూపమున
వాంఛను దీర్చిన ప్రేమ చేతనో!
పెరిగి త్రివిక్రమాకృతిని
వేడుక గొల్చిన వాడు నౌటనో!
తిరుగుచు పాద ముద్రలను
తీయగ బృందను నుంచి నందుకో!
వెరవిడి యేడ్చు రాధగని
వెచ్చగ రాల్చదు ధాత్రి బాష్పముల్‌॥ 118

ఈ ధరిత్రి...

మిక్కిలి కఠినురాలు! తనసాటి స్త్రీ - ఈ రాధ అడవిలో ఒంటరిగా ప్రియునికోసం విలపిస్తుండగా, సానుభూతితోనైనా ఒక్క కన్నీటిబొట్టు విడువకున్నది! అందుకు కారణం - ఆమెకు ఆతనిపై పూర్వప్రేమ ఎంతో వున్నది! కనుక, వరాహమై తనవాంఛ దీర్చినందువల్లను, త్రివిక్రముడై పెరిగి పాదంతో తననుకొలిచి మన్నించి వున్నందువల్లను, ఇప్పుడీయవతారంలోకూడ బృందావనంలో నిరంతరం పరిభ్రమిస్తూ తన సుందరమైన పాద ముద్రలతో ఆమెను అలంకరిస్తున్నందువల్లను, ఆమెకు ఆతనిపై మమకారం ఉండదా మరి!

అలకల దీసి కన్నులకు
నంజన మద్దగ కన్ను గీటుచున్,
తిలకము దిద్దు వేళగని
తీయని నవ్వుల పూలు రువ్వుచున్,
పలుచని చీర గట్టగని
బాహుల గ్రుచ్చియు లేవ నెత్తుచున్,
వలచెడు వాడె యచ్యుతుడు!
వంచన చేయున? నేడురాధికన్! 119

ఈ రాధపై...

స్వామికెంతో మక్కువ ఉన్నది! ముంగురుల అడ్డుతొలగించి కన్నులకు కాటుక దిద్దుకొనే వేళ చూచి కన్నుగీటే వాడు. నొసట తిలకం దిద్దుకొనే సమయాన కొంటెగా చూచి నవ్వుల పువ్వులు రువ్వేవాడు! పలుచని చీరగట్టుకొన్నప్పుడు ఆనందం పట్టలేక వచ్చి కౌగిటబంధించి పైకి లేవనెత్తేవాడు! అంత ప్రేమగలవాడు నన్నెప్పుడూ వంచించడు'

గోప కిశోర ! నీ మొదటి
 కూరిమి గీతము నేర్చి పాడుచున్,
తాపము దీరగా మదిని
 దాల్చుచు నీవగు భావ చిత్రముల్,
రేపును మాపు, నాశల ని
 రీక్షణ జేసెను నింత కాలమున్,
ఓపగ జాలదోయి! యిక
 నొద్దిక రాధిక నీవు రానిచో! 120

ఓయీ గోపాల బాలకా!—

నీ తొలిప్రేమ గీతాన్ని శ్రద్ధగా నేర్చుకొని పాడుకొంటూ, ఎల్లప్పుడూ నీ భావచిత్రాన్ని మనసులో నిల్పుకొని తాపంచల్లార్చుకొంటూ, ఉదయం, సాయంత్రాల్లో నీరాకకోసం ఇంత కాలం నీరాధ వేచియుండ గలిగింది. ఇకనైన రాకపోతే ఆమె భరించలేదు సుమా!

కనులను మూయకుండ, మది
గారడి చేయగ చూచు చొక్కమై,
మనసున తాపవహ్ని, ముఖ
మండల మందున దోప దీనయై,
తనువును గప్పు చీరవలె
తన్వి శరీరము వెల్లవెల్లనై,
కనలెను రాధ, మాధవుడు
కంటికి దోపమి చంద్రరేఖయై! 121

రాధ...

తన మాధవుడు కంటికి అగుపించక పోవడం వల్ల కనురెప్పవేయకుండ, తన మనసునేదో గారడిచేస్తుండగా, వెఱ్ఱి దానివలె ఒకే వైపునకు చూపులుచూస్తూ ఉండి పోతున్నది. మనసులోని తాపము ముఖముమీద ప్రతిఫలిస్తూ దీనంగా ఉంటున్నది. ఆమె కట్టుకొన్న చీరవలె ఆమె శరీరం తెల్ల తెల్లగా మారిపోతూ దుఃఖ వివశత్వంతో చంద్రరేఖగా మారి పోతున్నది!

అడుగక నిచ్చినావు హరి!
అంగజు నంగడి తీయ తాయముల్ !
అడిగియె వక్షమందు నను
అంగన యున్నను జేర్చినావురా!
అడిగియె నన్ను నీ యడవి
కంపితి నీకయి వేచియుండగా,
అడుగగ బోను నీ దయయె
హాయిని గూర్చును, నాల సించినన్ ! 122

హారీ !—

నేనడుగక నే నీవు మదనుని అంగటిలోని తీయని రుచ్యాలైన తాయాలను నాకిచ్చి అనుగ్రహించావు! నా అంగీకారంతోనే, నీ వక్షస్థలాన మరొక అంగన ఉన్నా నన్ను దరిజేర్చుకొన్నావు! నా యిష్టానుసారమే ఈ యడవిలో ఒంటరిగా నీకోసం వేచియుండటానికి పంపించావు! కాబట్టి నీవు ఆలస్యంచేసినా నేను కారణం అడుగబోను. నీదయయే నాకు హాయినిస్తుంది!

కనుగొను దాన రాకకయి
    కన్నులుగా ముఖమెల్ల నీకునై,
వినుటకు పాద నిస్వనము
    వీనుల నుంచి శరీరమెల్ల, నే
మనసును నుగ్గబట్టి, జడ
    మానము కాలము తోడ బోరుచుఁ
పనవుచు నుంటి, నొంటి, నిక
    వద్దు పరీక్షలు రాధ జేరరా! 123

నీ రాకకోసం...

ముఖమంతా కన్నులు చేసుకొని ఎదురుచూస్తున్నాను. నీ మృదుపద నిస్వనాలువిని, నీరాకను కనిపట్టటంకోసం శరీరమంతా చెవులు చేసుకొని, మనసునుగ్గబట్టి, కదలని కాలంతో క్షణక్షణం పోరాడుతూ, నీ రాకకోసం ఒంటరిగా ఎదురుచూస్తూ విలపిస్తున్నాను. ఇక నీపరీక్ష చాలు. వెంటనే రాధనుచేరగా రమ్మ!

వ్రాలకు మోయి నా పదము
బంభర రాజమ! నీదికాదు, మీ
సాలకు నెఱ్ఱిగా దగిలె
చక్కని యా వనమాల పుష్పొడుల్!
ఏల? సపత్ని సంగమము
నిట్టుల బొందిన నిన్ను నేల! నా
మోలను గోలమాని యిక
మ్రొక్కక పొమ్మటు లన్య సిద్ధికై! 124

ఓ మధుకరా!

ఎందుకు సమయం గడుపుకొనే ఈ దొంగ వేషాలు? ఒకప్పుడు నన్నాశ్రయించి, మరల వేరొకరి చెంత చేరావు. ఇప్పుడు నా - పాదాలకు మరల మ్రొక్కు తున్నావా? ఇవి నీవు కోరే వారివి కావు. నిజంగా నీవు మనసుమారి నా చెంతకు రాలేదని, నీ మీసాలకు ఎఱ్ఱగా అంటివున్న ఆ పుష్పొడి చెబుతూనే వున్నది! ఈ తీరుగా ఒకేసారి బహుభార్యలతో విహరించేవాడివి నీవు. నాకు వారితో కలిసి నీ ప్రేమను పంచుకోవడం ఇష్టంలేదు. కనుక నాకేదో నచ్చజెప్పే ప్రయత్నం చేయక మరెక్కడైనా ప్రయత్నించి ఫలసిద్ధి నందుకో! అంటున్నదీ ఖండితనాయిక!

నీవలె సారమాని విడు
  నీరజ నేత్రుడు నెమ్మి ప్రేతలఁ,
ఆ విషయ మ్మెఱింగియును
  నాతని వీడదు లక్ష్మి యేలొకో!
తీవల చక్కజేసి కథ
  తీయగ బాడిన నారదాదులఁ
ఆ వనజాక్షి నమ్మినది
  యంతియె! బంభర! ప్రేమ గ్రుడ్డిదౌ. 125

ఓయీ! బంభరా!

నీవు ఏవిధంగా పూవుమీదవ్రాలి అందులోని మకరందాన్నంతా జుఱ్ఱుకొని ఆపై దానిని విడచిపెడతావో – అలాగే ఆ కృష్ణుడుకూడ గొల్లపడుచుల సర్వస్వాన్నీ దోచుకొని దయ లేకుండా విడచి పెట్టేస్తున్నాడు. ఆ విషయం లక్ష్మీదేవికి గూడ తెలుసు! కాని, ఆలాంటి భర్తను విడువకుండా గట్టిగా ఆశ్రయించి వున్న దంటే అందుకు కారణం – ఆనారదాది మునులు ఆమహానుభావునిగూర్చి ఏవో గొప్పలు కథలుగా కూర్చి చెప్పడం వల్లనే! నిజానికి ప్రేమ గ్రుడ్డిది కదా!!

మధుకర ! యెంత సేపు నిటు
    మాధవు కీర్తన సేయ బోకుమా !
మధురము వాని మాటలవి
    మర్మములౌ గన చేత లెప్పుడున్,
అధరము పైని తీపియును
    నంతర మందున తిక్తమై కడున్
విధురము మేము నోచితిమి
    వేరొక రందగ వాని మాధురిన్ ! 126

ఓ మధుకరా !

ఎంత సేపూ నా చెవుల దగ్గర చేరి మాధవుని గొప్పలను కీర్తించకు. ఆతని విషయము మాకు చక్కగా తెలుసు! మాటలు తీయగానే చెబుతాడు కానీ, చేతలు మాత్రం ఎవరికీ అర్థం కావు. కనుక పెదాలపై తీపిని పులుముకొన్న ఆకృష్ణుని నమ్మినందువల్ల మేము విరహం అనుభవిస్తున్నాము. ఆతని మాధుర్యాస్వాదనం మాత్రం ఎవరో దక్కించుకొన్నారు !

సుందర మైన నవ్వులును
శోభిలు భ్రూకుటి విభ్రమాదులున్,
కుందము మించు పల్వరుస,
కుత్సిత మైనవి గాన, సుందరీ
బృందము వ్రాలు పాదముల
'వానిదె మా బ్రతుకం'చు 'లక్ష్మి'తా
నందిన పాదసేవ లవి
యబ్బవె మాక'ని ముజ్జగంబులన్! 127

కృష్ణుని...

అందాలు చిందే చిరునవ్వులూ, కదిలే కనుబొమల భావాలూ, కుందకుసుమాలను పరిహసించే తీరైన పల్వరుసా, అన్నీ...కపటమైన ఆకర్షణకలవే! అందులో చిక్కిన వారిక బయటపడటంకల్ల! అందుచేతనే అందగత్తెలందరూ ఆతని పాదాల నాశ్రయిస్తున్నారు. 'లక్ష్మీదేవి ఏపాదాలను సేవించి తానంత సౌభాగ్యాన్ని పొందినదో - ఆ భాగ్యం మాకు మాత్రం లభించదా?' అని ముల్లోకాలవారూ ఆతని పాదాల వ్రాలుతున్నారు?

హరి సుఖసంగ మంబునను
 హాయిని బొందిన రాధ, చెమ్మటల్
గురిసి విశేష గంధముల
 'గుప్పు'ను వల్వల వీడకుండనే
సురిగిన మోము వంచు, తన
 సొమ్ముల జూదము నోడి నట్లుగన్,
హరి సముఖాన జేరి యెటు
 లాయమ యున్నను విశ్వమోహినా! 128

ఆ రాధ...

శ్రీహరితో సమాగమం పొంది చెమటలతో తడిసి విచిత్రమైన వాసనలను వెదజల్లుతున్న వస్త్రాలను విడువకుండగనే, వాడిన వదనంతో, జూదంలో సొమ్ములు గోల్పోయిన వారిలా హరికి తన సర్వస్వం సమర్పించి, తలవంచి నిలువబడగా - ఆమె పూర్వశోభతో అలరారకున్నా సరే!......విశ్వమోహినిలాగే వెలుగొందుతున్నది! అందుకు కారణం ఆమె గోవిందుని ముందుండటమే!

వెలయు నదీ నదంబు లెటు
వేడుక సాగరు జేరి యొక్కటౌ!
చెలువగు పూలసార మెటు
చేరి మరందము గాగ మారునో!
అలరెడు వెల్గులన్ని యొక
యగ్నినె చేరి జ్వలించు రీతిగా,
చెలువలు వేనవేలు నిను
జేరి తరించిరి గోప బాలకా! 129

ఓ గోపబాలకా!

నదీ నదాలన్నీ వేరువేరుగా ప్రవహించినా తుదకు సముద్రంలో కలసి తమ ప్రత్యేకతను కోల్పోయినట్టు; వేరువేరు పూలనుంచి సంతరింపబడ్డ తేనె బిందువులన్నీ ఒకే మకరందంగా మారినట్టు; రకరకాల కాంతులన్నీ ఒక్క జ్వాలనంలోనే లయించురీతిగా, వేలాదిమంది స్త్రీలు నిన్నుకోరి, ఆశ్రయించి, ఆత్మార్పణ చేసుకొని నీలో లీనమై తరించారుగదా! (వారి అభిసరణం లోక సామాన్యమైన స్త్రీపురుషు లొకరికొకరు చేసే అభిసరణం లాంటిదికాదు! ఎందుకనగా ఆయన సర్వమయుడు!)

గాన విలోల! నీ చరిత
  గానము చేయుదు తన్మయంబునన్,
పాన మొనర్తు నయ్యది య
  పార సుధాంబుధి యౌచు నొప్పగా,
దానను ద్వేష రాగముల
  తప్పుడు దారుల నుండి ముక్తుడై
నే నిల హంసనౌదు, సరి
  నీరము క్షీరము బోల్ప జాలుదన్। 130

ఓయీ! వేణువినోదీ!

నేనెప్పుడూ నీ చరితాన్ని గూర్చి పరవశించి పాడుకుంటాను. ఆ గాన మాధుర్యం అనంతమైన అమృత సముద్రమై సాగగా, దానిని మరల నేనే పానం చేస్తూ కూర్చుంటాను. అలా చేసి నందువల్ల నేనే రాగ ద్వేషాది అరివర్గాలకు చిక్కని వాడనై, మంచి - చెడులను తెలుసుకో గలిగిన పరమహంసను కాగలను!

నీల విశాల వక్షమున
  నిల్కడ గాంచెను లక్ష్మి, బొడ్డునన్
గ్రాలెడు తెల్ల దామరనె
  కాపుర ముండును వాణి యెప్పుడున్!
జాలయి పుట్టె గంగ భవ
  జాలములన్ దొలగింప నంఘ్రులన్।
మేలగు నిన్ను గొల్చినను
  మేకొను నైహిక మర్థి స్వర్గమున్। 131

ప్రభూ!

నీ విశాలమైన వక్షస్థలాన చంచల స్వభావంగల లక్ష్మీదేవి కూడ నిలకడగా ఉంటున్నది! నీ నాభి కమలంలోనే సరస్వతీ దేవి కాపురం! నీ పాదాలనుంచే పాపహారిణియైన గంగ పుట్టి ప్రవాహమౌతున్నది! అందుచేత ఐహిక సుఖాలకోసం ధనమో, విద్యనో కోరేవారూ, పారమార్థిక సుఖం కోసం, పాపనాశనం కోసం మోక్షప్రాప్తి కావాలనుకొనేవారూ - కూడ నిన్ను సేవిస్తే చాలు! వారివారి కోర్కెలు ఈడేరుతాయి!

అటవి జరించు వేళ నొక
యంగన యెంగిలి పండ్లు దింటయున్,
అటునిటు గొల్ల చిక్కముల
నన్నము గైకొని యార గించుటల్,
అటుకులు దెచ్చె మిత్రుడని
యాసగ కొంగును విప్పి బొక్కుటల్,
అటనట భక్తులం దనుప
నాడిన యాటలు గావె యచ్యుతా! 132

అచ్యుతా!

నీ లీలలు అర్థం కానివి! అడవులబట్టి తిరుగుతూ ఉన్న సమయాన శబరి యిచ్చిన ఎంగిలిపండ్లు ఆరగించావు. నీతోటి గోపాలుర అన్నపుచిక్కాలు లాగికొని చల్దులారగించావు. కుచేలుని చేలంలో మూటగట్టి తెచ్చిన అటుకులు బలవంతంగా లాగికొని ఆరగించావు. ఇవన్నీ - నీవు భక్తులను సంతృప్తి పరచటానికి ఆడిన ఆటలే కదా!

భక్త శిఖామణుల్ కలరె
పర్వత రాజమ! చూడ నీవలెన్,
భక్తిని రామ కృష్ణులకు
నీకడ నీడను గూర్చి, కమ్మగా
భుక్తికి కంద మూలముల,
పొందగు తిష్టకు పచ్చగడ్డినిన్
రక్తిని నిచ్చి పేర్చుటను,
రాముని కృష్ణుని దాక గల్గుటన్ ॥ 133

ఓ గోవర్ధన గిరిరాజా!

నీకంటె భక్తశిరోమణులుగాని, అదృష్టవంతులు గాని ఉన్నట్లు తోచదు. ఎందుకంటావా? నీ లాగ ఆ లీలారూపధారులైన బలరామ కృష్ణు లను సేవించిన వారెవరున్నారు? భక్తితో వారు నీ పరిసరాలలో తిరిగే సమయాన నీడ నిచ్చావు! తినడానికి కమ్మని ఫలాలూ, రుచిగల కందమూలాలూ ఇచ్చావు! కూర్చుండి విశ్రాంతి తీసుకోవడానికి మెత్తగా లేతగడ్డిని పరచి ఉప చరించావు! అసలు వారి పాదస్పర్శతోడనే పరమ పునీతుడివయ్యావు!

రక్కసి యైన శూర్పణఖ
రాగము వ్యర్థము గాగ యజ్ఞమున్,
మక్కువ జేసి దేహమును
మ్రందగ జేయగ పూర్వ జన్మలో,
చెక్కిలి గీటి కుబ్జ కటి
సీమను బట్టి విదిల్చి దేహమున్ ;
చక్కని రూప మిచ్చితివి
సారస లోచనః యీ భవంబులోః 134

ఓ పద్మాక్షా!

నీవు రామావతార మెత్తినపుడు నిన్ను ప్రేమించిన శూర్పణఖ - తన ప్రేమ ఫలించ లేదని యజ్ఞం చేసి అగ్నిలోదూకి దేహత్యాగం చేసినందువల్ల - ఆమెకా జన్మలో తీర్చలేని కోర్కెను తీర్చటానికి, కృష్ణావతారంలో ఆమె కుబ్జగా, కురూపిగా జనించి వున్నపుడు - ఆమె వంకరటింకర రూపాన్ని చక్కజేసి, సౌందర్య వతియైన ఆమె కోర్కెను దీర్చావటగదా! (భక్తుల కోర్కెలు ఆలస్యంగా నైనా తీర్చగల వనటాని కిది చక్కని ఉదాహరణకదా!)

పెంతును వైరమున్ బలము
బెంపును బేరును నున్నవారితో,
ఇంతయు రాజ్య సంపదల
నెప్పుడు బొందను, శాప యుక్తుడన్.
ఇంతులు వంతలం బడుదు
రెప్పుడు వశ్యుడ గామి వారికిన్ ?
ఇంతకు నర్థహీను నను
నేల వరించితి వంటె! రుక్మిణిన్ ? 135

కృష్ణా!

రుక్మిణీ సతి ప్రేమను పరికించడానికి కాబోలు! నీవామెతో చతురోక్తులాడుతూ 'రుక్మిణీ! నే నెప్పుడూ బలవంతులతో విరోధం కొని తెచ్చు కొనే వాడిని. యయాతి శాపకారణంగా నా కెప్పుడూ రాజ్యాధికారం ఉండబోదు. స్త్రీలకు నేను కట్టుబడి మెలిగేవాడిని కాదు. కనుక నన్ను వరించిన వారెప్పుడూ విరహంతో తపించవలసి వుంటుంది. పైగా అర్థహీనుడ్ని! ఇవన్నీ లభించే అవకాశం శిశుపాలుడితో నీకు వివాహం జరిగివుంటే - ఉండేది! అతడ్ని తృణీకరించి నన్నెందుకు వరించావు?' అన్నావటగదా ?

నీ పయి భక్తి, ప్రేమమును
 నీరజ లోచన కుంట చేతనే
ఓపెను ప్రేమలేఖ నటు
 లొడ్డులు బంపని రీతి నంపగా,
గోప కులాధిపా! సతులు
 గోరరు రాజ్యము, లంతకంటె తా
మోపరు సేవజేయ తమ
 కొప్పుగ లొంగిన భర్త, భీరువుల్‌॥ 136

గోపాల చూడామణీ!

నీమీద భక్తీ, ప్రేమా అపారంగా ఉండటం చేతనే గదా–ఆకాలంలో ఏ కన్నెపిల్లా చేయని రీతిగా రుక్మిణి నీకు ప్రేమ లేఖ నంపగలిగింది! నిన్ను తనవానిగా చేసుకొన్నది! అయ్యా! ఆమె పతివ్రత! ఉత్తమ సతులు రాజ్యాలూ, సంపదలూ చూచి వరించరు. స్త్రీకి లొంగని, కట్టుబడని స్వాతంత్రునే వారెక్కువ గౌరవిస్తారు. బలవద్విరోధి అయినప్పుడే పురుషుని పరాక్రమం రాణించేది! అలాంటి వారినే స్త్రీలు ప్రేమిస్తారు!

ఏమి తపంబు జేసితివో
యేమొ వసుంధర! స్వామి తాకుటన్.
ఆమని రూపశోభ నతి
హర్షము నొందుచు నుంటి విట్టు! నీ
కీ మధురంపు సోయగము
లెన్నడు గల్గెను? వామనుండుగా
కోమలి! కొల్చినందులక?
క్రోడము కౌగిట దన్ని నందుకా? 137

ఓ వసుధా!

నీవేమి తపస్సుచేసి కృష్ణపరమాత్మని స్పర్శనందుకొన్నావో యేమో...నీ వీలాగ వసంతఋతురూప శోభతో సొగసు లొలకబోస్తూ, సంతోషంలో తేలియాడుతున్నావు। అసలు నీకీ యందాలు ఎందుకొచ్చాయి? ఎప్పటినుంచి వచ్చాయి? స్వామి, వామనావతారంలో కొలిచినందుకా? లేక వరాహాతారంలో నిన్ను కౌగలించినందుకా? నీకీ - నిత్య వసంత శోభలూ, నిరుపమానమైన సిరులూ, సౌరులూ?!

హరిణివి-నీవె ధన్యవిటు
హార, విచిత్ర విహారి శ్రీహరిన్
అరమరికల్, భయాదులను
నందక గందువు భర్త ముందటన్,
పరవశ చిత్తవృత్తి, కను
పాపల కందిన ప్రేమ భక్తినిన్
నరవిని జూపనోప, బతి
చాటున నాతిని గాన-నీవలెన్! 138

ఆ శ్రీహరి —

గోపిక హృదయమంతా నిండిపోగా, తానొకరి యిల్లాలైనందున సంఘపు కట్టుబాట్లకులోనై తన ఆరాధనను బహిర్గతం చేయలేక పోతున్నానంటూ ఒక ఆడులేడితో అంటున్నది... 'ఓ హరిణీ! నీవు జంతువైై ధన్యవైనావు! నీ భర్త యెదుటనే నిర్భయంగా హారాది విచిత్రాభరణ భూషితుడైన శ్రీహరిని చూడగలుగుతున్నావు! నేను మనసులో పరవశమందుతున్నా ప్రేమతో ఆయనను తనివార చూడలేక పోతున్నాను. ఎందుకనగా నేను భర్త చాటు భార్యను!

ఎన్నడు బ్రహ్మ శంభు సభ
  నెవ్వతె నిన్విన దట్టి యచ్చరే
కన్నుల కద్దుకో గలుగు
  ఖండితుడా భవదీయ శత్రువున్ !
మన్నిక నీవొసంగు మృతి
  మన్పగ మాధవ! నాక వాసిగా,
ఎన్నిక చేయునే పతిగ
  నెవ్విధి నిన్గన దీలు జెందకన్! 139

మాధవా!

నీచేత మృతినందిన నీ శత్రువును నీవు స్వర్గానికి పంపుతున్నావు. అక్కడ స్వర్గప్రాప్తి నందిన నీ శత్రువును అప్సరసలు ఆదరించి అలరించవలసి యుండగా, అందరు అప్సరసలూ ఆతడ్ని ఆదరించరు. ఎందుకనగా-స్వర్గానికి అతిథిగా వచ్చిన నీ శత్రురాజు నిన్ను జ్ఞప్తికి తేగా, నిన్ను గూర్చి వారు బ్రహ్మ సభలోనూ, శివుని సభలోనూ గొప్పగా వినివుండటం చేతనూ, ఆ స్తుతులు గొన్న నిన్ను కలసికోలేక పోయామన్న దిగులు వారిని ఆవరిస్తుంది కనుకనూ, అలా నిన్ను గూర్చి వినని అచ్చర యెవ్వతైనా ఉంటే ఆమె మాత్రమే నీచే స్వర్గగామియైన శత్రువును సంతోషపరచగలదు!

శ్యామల కోమలాం బుదమొ!
సాగర నీర వినీలతో! యనన్,
స్వామి వినూత్న దేహరుచి
సంపద సంగతి నొప్పు కాంతలఙ్
ఏమని చెప్పవచ్చు? తమ
యెప్పటి వర్ణము గోలుపోయి, గా
రాముగ నాడు యేన్గులటు
రంజిలు వారలె కృష్ణ! ప్రేమలో! 140

ఓ కృష్ణా!

నీలమోహనా! లలితమైన నల్లని మబ్బు తున కయా? సాగరంలోని నీటి నల్లందనమా! అన్నట్లు ప్రకాశించే నీ దేహ కాంతి ప్రభా వంతో, ప్రేమగా నిన్ను చేరి చరించే గోప కాంతలు తమ వన్నెను కోల్పోయి ఆడు ఏన్గుల వలె శ్యామల వర్ణంతో ప్రకాశిస్తున్నారు సుమా!

సొగసులు జిందు నీ జిలుగు
చోద్యపు కన్నుల కాంతి తీవెలున్
వగలను బోవు వ్రేతల న
పొంగ లతల్, మెలిబడ్డ యూయెలన్
సొగసుల వేల్పు జంట, సుమ
సూన శరాలకు నొంటి పంటగా
రగిలిచి తాపవహ్ని హృది
రంజిల నూగదె కృష్ణ! హాయిగా ! 141

కృష్ణా!

అందాలొలికే నీ కన్నుల వెలుగునుండి కొనలు సాగిన కాంతి తీగలును, వయ్యార మొలకబోసే గొల్లపడుచుల క్రీగంటి చూపులనే తీగలును, పరస్పరం కలిసిపోయి - మెలికబడగా నేర్పడిన ఊయెలమీద రతీమన్మథులు కూర్చున్నవారై, తమ పూలబాణాలతో ఏకైక లక్ష్యంగా విరహాగ్నిని మా హృదయాల్లో ప్రజ్వలింపజేయబూని, తమపని సాధించుకొని, హాయిగా ఊగుతున్నారు గదా!

నీ యధరంబు దాకుటను
    నిగ్గుల జగ్గులు దేరి, చెంపలన్
తోయజ పత్ర నేత్రలకు
    దోసము దెల్పెడి గుర్తు లౌటచే
తీయగ జూచి చూచి నిను
    తిట్టుచు నుందురు కృష్ణ! మెత్తగా,
మాయలమారి చేతలను
    మాన్యల గుట్టులు రట్టు చేతువా? 142

కృష్ణా!

నీ పెదవులు ప్రియురాండ్ర చెక్కిళ్లపై తాకించి నందువల్ల, అవి తళతళ మెరవ సాగాయి! అంతేగాదు. అందంగా నీ అధరాల గుర్తులు అక్కడవుండి పోయాయి! తీయని తమ అనుభవాల నెమరు వేతగా వారా గుర్తులను చూచుకొంటూ, మెత్తగా నిన్ను నిందిస్తుంటారు. ఎందుకనగా, నీ మాయలమారి ప్రేమకు లోబడి నిన్ను రహస్యంగా కలుసుకొన్న ఆ గౌరవనీయల గుట్టు బయలుపడే రీతిగా వారి బుగ్గలపై నీవా గుర్తులుంచినందుకు!

బృంధయె పద్మమై మెరయ
　　భృంగమవై, ఘన కర్ణికస్థుడై
అందము చిందు నిన్గనుచు
　　అంగన లావిధి గూర్చి చేతులన్
ఉందురు మోహనా! జలజ
　　మొప్పుగ విచ్చుచు నున్న యట్టులన్,
విందగు వేణు మాధురుల
　　విస్తృతి తేనెల వారికివ్వరా! 143

మోహనా!

బృందావని ఒక పద్మం కాగా, నీవొక తుమ్మెదవై, ఆ పద్మం మధ్యనున్న దుద్దులో నిలువగా, నిన్ను చూస్తూ అందగత్తెలు చేతులు కూర్చుకొని నీ చుట్టూ నిలువగా, చూపరులకు అప్పుడే వికసిస్తున్న పద్మం లాగున ఉంటుందా వనితలు నిలచిన తీరు! అలా కూడిన ప్రేమికురాండ్రకు నీ వేణుగాన మనే తీయని తేనతో విందు నందివ్వు!

వెన్నెల వెల్లువై నగవు
　విచ్చిన కల్వల కొల్లగొట్టగా,
కన్నుల కాటుకల్ గురిసి
　కాంతుని కాంతలు గాంచ కుండియున్
కన్నెతనంపు జాతరను
　కానుక బెట్టిరి లజ్జపజ్జలన్;
కన్నడు మచ్చు జల్లినను
　కామన దీర్చిన దృప్తి వ్రేతలన్. 144

కృష్ణుని...

చిరునవ్వు వెన్నెల వెల్లువై ప్రవహించడంవల్ల, కలువలలాంటి కన్నులను విప్పి ఆశగాచూస్తున్న గోపికల కన్నులు చూడలేకపోయాయి! ఆనంద రసంలో తలమున్కలైన ఆ కాంతల కన్నులు చెమర్చి, కాటుక కరిగి, చూపు మందగించి, ఏమి జరుగుతున్నదో చూడలేకపోతూనే, తమ కన్నెరికాన్ని పండించుకోవచ్చిన పండుగలో ఎగ్గు సిగ్గులను ఆ మోహానునికి కానుకగా సమ ర్పించారు! ఆతడేమి మత్తుజల్లెనోగాని, గోపిక లకు మాత్రం తమకు కోర్కెదీరిందనే తృప్తి మిక్కిలిగా మిగిలింది!

సురభిళ మొప్పు తెమ్మెరల
శోభితమౌ వనవీథి గోపికల్
కరగుచు గాలి వెల్లువను
కాంతుని జాడను జూడబోదు, రా
తరుణులు బోల్చుకొందు రట
తక్కిన వాసన లందు చక్కగా
గురిసెడు పారిజాత సుమ
కోమల గంధము కృష్ణ! నీదిగా. 145

కృష్ణా!

వనవీథిలో గోపికలు నిన్ను వెదకే ప్రయత్నంలో, సుగంధ సమ్మిళితమైన గాలిలో తాము కరిగి పోతూ, ఆ గాలి వెల్లువలో తమ ప్రియుని జాడను వెదకుతున్నారు! అడవి పూల పరిమళాలు ఎన్నో కలిసి ఆ గాలి వెల్లువలో వచ్చి తమను తాకుతున్నా, అందులో కోమలమై, మధురమైన పారిజాత పరిమళాలు ప్రత్యేకించి వచ్చే జాడను పోల్చుకొని, ఆ వైపున నీవుండ గలవని నిన్ను అన్వేషించుకొంటూ వస్తారు!

బరువగు కృష్ణ భావనల
  బృందను బర్వులు వారు భామలన్
విరహ వినోద కావ్యములు
  విన్చును విందుగ నందె సందడుల్
సరగున జారు పయ్యెదలు
  చక్కగ దెల్పును ప్రేమ మర్మముల్.
పరగెడు శూన్య కుంజములు
  వ్రచ్చును గుండెలు, వచ్చు నూర్పులున్ 146

కృష్ణ పరమాత్ముని...

మోయలేని భావాలను గుండెలలో దాచుకొని, బృందావనిలో పరుగులెత్తే గొల్ల పడుచుల కాలి యందెల సందడులు విరహకావ్యాలను వినోదంగా వినిపిస్తాయి! వారి యెదపైనుండి జారే పయ్యెదలు వారి ప్రేమ మర్మాలను తెలుపుతాయి! వారు విహరించిన పూబొదలు శూన్యంగా కన్పించడంచేత గుండెలు పగిలి నిట్టూర్పులు వస్తాయి!

నవనవ లాడు నా ప్రణయ
నందన సీమను కొల్ల గొట్టుచో
కువకువ లాడు యౌవనపు
కోరిక లీరిక లెత్తి వ్రేతలన్,
భువులకె భూమియైన దగు
భూరి విశాలము గృష్ణు వక్షమున్,
దవులగ వారు మారిరొక
తామర మాలగ. ప్రేమ మీరగా! 147

నవనవ లాడుతున్న...

'ప్రేమ' అనే నందనోద్యానాన్ని కొల్లగొట్టి నప్పుడు, గోపికలలో యౌవనోచితమైన కోరికలు మొలకలెత్తి వారిని ఉన్నచోట ఉండనివ్వలేదు. లోకాలకెల్ల ఆవాసమైన ఆ కృష్ణుని సువిశాల వక్షస్థలంలో తగిలి వ్రేలాడటానికి వా రొకానొక తామర పూమాలగా మారి పోయారు. (ఉద్యానవనాన్ని కొల్లగొట్టే పనిలో లభించేది పూల సేకరణ. ఆ పూలకు బదులు గోపికలే పూలుగామారి, కృష్ణుని వక్షాన పూమాలగా వ్రాలారు)

కన్నుల రెప్ప వేయకను
  కన్నని గాంచుటఁ గాంత కన్నులకా
చెన్నులు వాసి నల్లనయి
  చెల్లెబొ! కాటుక పిట్టలట్లుగా;
వెన్నుని పాద ముద్రలను
  వేమరు ముద్దిడి బృంద భూమిలో
కన్నెలు బొందినారు తమ
  కాంక్షిత మొప్పగ, మోవు లెఱ్ఱగా! 148

కృష్ణుని కొఱకు...

రెప్పపాటు లేకుండ ఎదురుచూచిన కాంత కన్నుల రంగు తగ్గి కాటుక పిట్టలవలె నల్లగా మారాయి. ఆతని పాదాల గుర్తులు బృందావనిలో పడగా, పలుమారు అనురాగంతో ఆ పాదముద్రలను ముద్దుపెట్టుకొన్న కన్నెల పెదవులు తమకు ఇష్టమైన రీతిగా ఎఱ్ఱబారినవి!

మానవతీ లలామలకు
మాన్యుని వెన్నుని రూపు గుండెలో
పూనిన కారణమ్మునను
పొంగెను వక్షము లున్నతంబుగా,
కానను, కన్ను మూయు టను
కాంతల యాటల వానిబట్టగా,
వేనలి విప్పుగా విసరి
వేతురు వ్రేతలు జాలరుల్ బలెన్! 149

కృష్ణుని రూపాన్ని...

మగువలు ఎదలో పదిలంగా ఉంచుకొన్నారు కనుక నే, వారి వక్షస్థలాలు ఉన్నంతగా ఒప్పుతున్నాయి! అడవిలో దాగుడు మూతలాడే కాంతలు ఆతడ్ని పట్టుకోవడానికి, జాలరులు వలలు విసిరేటట్లు తమ కొప్పులు వీడగా విసరుతున్నారు! (విరహంలో వీడిన కొప్పులు-లక్ష్య సాధనకు విసిరిన వలలు లాగున్నవి!)

సుందర నీల మోహనుని
చూపుల డీకొని ముక్కవోవగా
చిందర వందరై పడెడు
చిత్తజు బాణ సమాజమో యనన్!
సుందర బృంద సీమగల
చుక్కల కొప్పుల పూలురాలె, తా
చందురు బోలు ప్రేమికుని
సన్నిధి, చూపున చూపు గల్పుటన్ ! 150

అందాల బృందావనంలోని—

తారలు (గోపికలు) చంద్రునివంటి తమ ప్రేమికుని సన్నిధిలో చూపులతో చూపు కలిపినందువల్ల, తమ కొప్పులలోని పూలు (మోహావేశంతో) జల్లున రాలాయి! ఆ పూలు రాలటం ఎట్లున్నదనగా, మనోహరుడైన నీలమోహనుని చూపులతో డీకొన్న మదనుని పూల బాణాలు ముక్కవోయి, చిందర వందరగా నేల రాలి నట్లున్నాయి! (కృష్ణుని చూపులు మదనుని బాణాలను గెలిచాయి.)

మనములె యద్దముల్, వలచు
 మాన్యల రూపము లైన పత్రముల్,
పెనగొను నందు రూపుగొని
 ప్రేమలు, భామల సుందరాకృతుల్,
కన నరవిచ్చి నట్టి యొక
 జంజపు క్రోవగ చుట్టు నిల్వగా
కనబడు కృష్ణమూర్తి, ప్రతి
 కాంతను తానొక గండు తుమ్మెదై। 151

అద్దాలవంటి...

మనసుగల కృష్ణుని ప్రేమికురాండ్రు తామర పూరేకులు కాగా, ఆతని చుట్టునూ వారు అర విచ్చిన తామర మొగ్గలా నిలచినప్పుడు, రూపు దైకొన్న ప్రేమ ఒక్కొక్క సుందరాంగితో కలిసిపోయినట్టుగా, స్వామి మనోహరాకారం ఆ మగువలలో ప్రతిఫలిస్తూ, ఆ చుట్టూచేరిన గోపికలనే పద్మపత్రాలెన్ని ఉన్నవో అన్నింటికీ అన్ని గండు తుమ్మెదలు ముసిరినట్టు, ఆ కృత్రిమ మహాపద్మంలో ప్రకాశిస్తున్నది !

వెన్నెల చెఱ్వు లోపలను
వేడుకఁ గల్వలు నెఱ్ఱ తామరల్
మన్నిక నొంటితో నొకటి
మారు మలంగిన భంగి దోచుచుఁ,
కన్నెలు రాస మండలిని
గన్పడి నారలు నిన్ను గూడుటఁ,
పున్నెము జేసి బృంద, సుమ
పుంజము లిట్టివి పొందె మాధవా! 152

మాధవా!

రాసమండలిలో నిన్ను గోప కన్యలు కలిసి నప్పుడు - వెన్నెల చెరువులో నల్లకలువలూ - ఎఱ్ఱ తామరలూ, పరస్పరం కలిసి చిక్కుబడి పోయినట్టున్నారు. ఎందుకనగా నీవు నీ నల్లని రూపుతో ఒక్కొక్కరితోను ఒక్కొక్కడివిగా, వేరువేరుగా కలిసి రాసక్రీడచేశావు కనుక! ఈ తీరుగా బృందావనము నీ రూపాలనే నల్లకలువ పూలనూ; గోపికలనే ఎఱ్ఱ తామరలనూ, ఎంతో పుణ్యంచేసి తన పంటగా పొందింది సుమా!

గాన విలోల! లోకముల
గావగ శూలి విసంబు నట్టుగా,
కానను లేచు చిచ్చు నవి
కారుడ వౌచును ద్రావి నావుగా!
పూనిన గంగ, చంద్రులను
బొందగ శాంతిని శంకరుండు, నీ
వానిన చల్లులుఁ, మెసవి
నట్టివి వెన్నలె యార్పె నర్చినిన్! 153

గానలోలా!

గోపాలా! లోకాలను రక్షించడానికి శివుడు హాలాహలాన్ని గ్రోలినట్టుగా, గోపాలురను కాపాడటానికి నీవు నిర్వికారంగా దావాగ్నిని పానంచేశావు! ఆశివుడు తలపై చల్లని గంగనూ, చంద్రునీ ధరించి ఉండటంచేత ఆ త్రాగిన విషాగ్ని హానిచేయకుండగ చల్లారినది. అలాగే నీవు చిన్ననాడు కొల్లలుగా త్రాగిన చల్లలూ, మెసవిన వెన్నముద్దలూ నీ కడుపులో నిలచి యుండి నీవు పానం చేసిన దావాగ్ని వేడిని చల్లార్చియుండవచ్చు!

పామది ఛత్రమై బరగె!
　　పామె వదిల్చెను తండ్రి సంకెలల్,
పాము నుఱింబు ప్రవిచ్చితివి!
　　పాముల వైరినె గూర్తు తేరుగా,
పామును పాన్పుగా గొనుదు!
　　పాము శిరంబుల జేతు రంగమున్!
పాముల సంగడీని నిను
　　భామలు మెత్తు రదెట్లు మాధవా!? 154

మాధవా!

నీవు పుట్టగానే ఒక పాము నీకు గొడుగై నీడను పట్టింది! తండ్రి సంకెలలు విడగొట్టింది! ఆడు కొనే వయసులో అడవిలో గో, గోపకుల మ్రింగి వేసిన ఒక పాము కడుపులోనికి నీవు ప్రవేశించి, దాని వక్షాన్ని చీల్చుకొని వెలుపలికివచ్చావు! అసలు నీ వాహన మేమో పాముల విరోధి గరుత్మంతుడు! పాల సముద్రంలో నీకు పాన్పుగా అమరినదొక పాము! నీ నాట్యానికి రంగస్థలం ఒక పాము శిరసు! ఈ తీరుగా ఏదో విధంగా పాములతో సంబంధం కలిగిన నిన్ను కోమల స్వభావంగల స్త్రీలెలా మెచ్చుకొంటారో గదా!

శ్యామల కోమలాంగముల
శాంత రసార్ణవు డైతి కావునన్,
కోమలి సీత దూషణకు
కోపము జెందవు నాడు ధావకున్;
సీమము దప్పి పెద్దలను
నీచులు నిందను జేయ రాదనన్,
మామను జంప నేగుతరి
మర్దన జేసితి కృష్ణ! చాకలిన్. 155

కృష్ణా!

రామావతారంలో కోమల శ్యామల వర్ణుడివై పుట్టి శాంత సముద్రునివిగా నుండటం చేత, సీతా దేవిని నిష్కారణంగా నిందించిన ఆ రజకుని మాటలకు కోపగించక మన్నించి విడచిపెట్టావు. కాని, ఈ యవతారంలో 'అదుపు దప్పి, అధికులను నిందించే నీచులు తప్పక శిక్షింపబడవలసినదే!' అనే ఉద్దేశంతో, కంసుని చంపబోయే సమయంలో ఆతని శ్రీలెనుముందే హరించే ఉద్దేశంతో, కంసుని రాజచిహ్నాలైన ఉత్తమ వస్త్రాలను నీకిమ్మని అడిగి, ఆ మాటకు తిరస్కరించి నిన్ను నిందించిన రజకుని ఒక్క దెబ్బతో సంహరించావు గదా!

సీవు చొరంగ చోరుడని
నిన్నును బట్టగ నింట వెల్పలన్
కావలి గాచినారు, వ్రజ
కాంతలు బాపురె! యెంత ధన్యలో!
భావన చేయ నీ చొరెడు
వాకిలి, యిల్లును పుణ్యతీర్థమౌ,
కావలి గాచి పట్టగల
కాంతలు ముక్తలు, చూడ మాధవా! 156

మాధవా!

గొల్లపడుచులు నీవు తమ యింట ప్రవేశింప గా నేపట్టుకొని దొంగగా నిలబెట్టడానికని ఎంతో జాగ్రత్తగా ఇంటిలోపలా, వెలుపలా కాపలా కాస్తున్నారు. వారెంత ధన్యురాండ్రో కదా! ఆలోచింపగా, నీవు ప్రవేశించిన ఇల్లే పుణ్య తీర్థం కదా! అట్టి పవిత్ర ప్రదేశాలలో నీకోసం ఎదురుచూచి నిన్ను కని-పట్టగలవాను, నిజంగా (దర్శన స్పర్శనాదులతో) మోక్షార్హతను పొందుతున్నారు!

కోపను డౌ మునీశ్వరుడు
కోరి తమింగను చుండ నిన్ను. నీ
రూప మనోహ రత్వమున
రోయుచు వచ్చి చరింప చెంత, నా
కోపియు సూక్ష్మ రూపమున
కూరిమి నీ హృది జేరి శ్వాసతో,
గోప కిశోర ! కాంచెనట
కొండల కోనల క్రొత్త లోకమున్ ! 157

గోపాలబాలకా !

దుర్వాసముని నిన్ను చూడటానికివచ్చి, సుదూరంనుండి నీ మనోహర రూపాన్ని చూచి ఆనందిస్తుండగా, ఆతని కోర్కెదీర్చటానికై చెంతకు జేరి ఒకానొక సుందర రూపంతో ఆయన చుట్టూ మెలగుతున్న నిన్ను, నీ నిజరూపంతో చూడటానికై దుర్వాసుడు సూక్ష్మరూపం ధరించి శ్వాసతోపాటు నీ హృదయంలో ప్రవేశించి, అక్కడ భయంకరమైన అడవులూ, కొండలూ, నిర్జన ప్రదేశాలూ, చూచి, ఒక్కపాటునోట తాను బడి, బయటబడి, నీ మహిమను స్తుతించి వెళ్లాడట గదా!

ఎంతయొ! తర్క పాండితిని
నేర్పడ జూపితి రాయబారమం
దెంతయు నోర్మి జూపితి వ
దెంతగ దూఱిన చేది భూ విభుం
డెంత పరాక్రమం బసురు
లెల్లగ జేసిన మారణంబునన్!
ఎంత పరాచకంబు లిల
నింతుల కంతుని బారికిచ్చుచో! 158

కృష్ణా!

నీ వొక్కొక్కచోట ఉదాత్తమైన జ్ఞానిగా, ఉన్నతమైన శాంతవీరుడుగా, అసమానమైన పరాక్రమవంతుడుగా కనిపిస్తావు! అదే సమయాన అల్లరి చిల్లరి వాడవుగాకూడ అగుపిస్తున్నావు లేకపోతే కురుసభలో పాండవ రాయబారిగా వెళ్ళి ఎంతగొప్ప తర్కశాస్త్ర పాండిత్యాన్నీ, వాక్చాతుర్యాన్నీ ప్రదర్శించావు? రాజసూయంలో శిశుపాలుడెంత నిందించినా నూరు తప్పులదాక ఎంత ఓర్పును ప్రదర్శించావు! మరెందరో రాక్షసులను సంహరించి రాక్షసాంతకుడి వనిపించుకొన్నావు! అలాంటి వాడివి స్త్రీల విషయం వచ్చేసరికి చిలిపివాడివై, వారిని మదనుని బారి కప్పగిస్తున్నావు!

కురుసభ నోడి ద్యూతమున
  కూరిమి ద్రౌపది మాన హానిలో
వెరవిడి బావ లున్న యెడ
  విశ్వస నీయము నీదు సాయమున్
శరణని వేడ చెల్లెలికి
  సత్వర మివ్వవె వల్వ లవ్విధిన్!
పరమ పవిత్రమైన గురు
  భావము బోయది! కృష్ణ! కృష్ణకున్. 159

కృష్ణా!

కౌరవ సభలో జూదంలో ఓడిపోయి, తమ ధర్మ పత్ని ద్రౌపదికి నిండు కొలువులో మానహాని జరుగుతున్నపుడుకూడ, నిస్సహాయులుగా నీ బావలు పాండవులు నిలచివున్న సమయాన, ఇక నీవే దిక్కని నమ్మి ప్రార్థించిన చెల్లెలు ద్రౌపదికి వలువలిచ్చి ఆదుకొన్నావు కదా! నిజంగా ఆమెకు తన సొంత అన్న మీదికంటే మిన్నగ విశ్వాసమూ, గౌరవమూ ఉన్నాయి సుమా!

ఒకతెకు భక్తి కట్టువడి
యొక్కతె కక్కట రక్తి జిక్కితే?!
ఒకతెను మోహ పాశముల
నొక్కతె వంశిని నూది కట్టితే?!
ఒకతెను కల్ల మాటలను
నొక్కతె నల్లరి చేత బట్టితే?!
ఒకటని చెప్పలేము గద
యొగు పనుల్ గణియింప మాధవా! 160

ఓ మాధవా!

నీ వొకచోట భక్తురాలికి కట్టుబడి ఆమెను ప్రేమించి పెళ్ళాడావు! మరొక మగువ సింగారాలకు అమ్ముడుబోయి ఆమె ప్రేమలో చిక్కుకొన్నావు! ఇంకొక తెను మోహంలోముంచావు, వేరొక వనితను వేణుగానంతో పట్టికట్టావు! ఒక యువతిని కల్లబొల్లి మాటలతో వలలో వేసుకొన్నావు! మరొకామెను అల్లరిపెట్టి ఆకర్షించావు! ఇలా–నీ యల్లరి చేతలు ఒకటా? రెండా? లెక్కలేనన్ని!



ఎన్నడు చేరు రాధ నిను నీప్సితముల్ ఫలియింప నొంటిగా...

(పుట -100)

నెయ్యము చేయ గోరినను,
నిక్కపు భక్తుని జూడ గోరినన్,
వియ్యము నందు టందునను,
విస్తృత కీర్తిని బొందు నేర్పునన్,
కయ్యము జేయ జూచినను,
కాలము కర్మము నోర్వ బూనినన్,
ఎయ్యెడ నీవు నర్జునుడె
ఎన్నిక గాంతురు పార్థసారథీ! 161

ఓ పార్థసారథీ!

నీవూ - ఆ యర్జునుడూ - అనేక విషయాలలో లోకానికి ఆదర్శప్రాయులు! నీవు నిజమైన స్నేహితుడివైతే, అర్జునుడు నిజమైన భక్తుడు! నీవు నిజమైన వియ్యపునేస్తమైతే, నీ బావ అసలైన కీర్తిప్రతీక! యుద్ధ నిర్వహణలో నీవు నిపుణుడవైతే, అర్జునుడు నీ గీతవిని కాలమూలమైన కష్టసుఖాలను ఓర్వనేర్చిన మానవులకు ఆదర్శ ప్రాయుడయ్యాడు! మీ కలయిక అపురూపము! విశ్వానికది ఆదర్శప్రాయమూను.

చిలిపిగ మిత్రవింద కల
చేసిన చేష్టల నీవె చెప్పగా
చెలునికి స్వప్న వృత్త మిటు
చెప్పిన వారెవ రంచు తెల్లబోఁ
కలికిని నమ్మ బల్కితివి
'కాదదికల్ల ! నిజంబె !' యంచు, నా
చెలువయు మోహ మాంద్యమని
చిత్రముగా నిను నమ్మె మోహనా! 162

ఓయీ! విశ్వమోహనా!

నీవు ఉద్దేశ పూర్వకంగానే మిత్రవింద కలలోకి వెళ్ళి కనుపించి, ఏవేవో చిలిపి పనులుచేసి, ఆవృత్తాంతమంతా మరలా నీవే ఆమెకు వివరించి, ఇంతమంచి కలవచ్చినదికదా నీకు? అని ఆమెను ప్రశ్నించగా, తన కలనుగూర్చి యీాయన కెవరు చెప్పారని ఆమె విస్తుబోతున్నంతలో – 'ఓసీ బేలా! ఇదంతా కలనుకొంటున్నావు గదూ! అది కలకాదు నిజమే!' అని కృష్ణుడనగా పాపం ఆమె మరలా ఆతని మాటలునమ్మి – 'నిజమే కాబోలు! నే నాతని మోహంలో కూరుకుపోయి, నిజమేదో! స్వప్నమేదో తెలుసుకోలేని స్థితిలో ఉన్నాను' అనుకొంటుంది.

ఊపిరి లేని కంబమున
నుండవె యుజ్జ్వల రూప మొప్పగా,
తాపము బాపి బాలకుని
తండ్రి యహంకృతి నుండి కావవే!
రూపము లేని నీకుగల
రూపము లెన్నొ! ద్రవంబు పాత్రలో
రూపము మారి నిల్చునటు
లోకుల మానస మందు మాధవా! 163

మాధవా!

ప్రాణం లేని స్తంభంనుంచే నీవు పుట్టుకువచ్చి ప్రహ్లాదుని తండ్రి బారినుంచి రక్షించావు! నీ కసలు రూపమనేది లేదుకదా? అలాంటి వాడివి ఇన్ని రూపా లెందుకు ధరిస్తున్నావు? నీవిలా ఒక్కొక్కచోట ఒక్కొక్క రూపంలో అగుపించటం చూడగా, లోకులు మనసులో భావించిన రీతిగా నీవు రూపుగైకొంటూ, ద్రవ పదార్థం రకరకాల పాత్రలలో రకరకాల రూపాలు గైకొన్నట్టు - ప్రపంచానికి కనిపిస్తావని పిస్తున్నది.

వెన్నుని పాద పద్మముల
వేమరు గొల్చిన చీకు చూడడే!
కన్నని యాశ్రయించినను
కాళు లవెందుకు రావు పంగుకున్?
వెన్నలు మ్రింగువాడు మొఱ
విన్నను మూకకు వాక్కు లబ్బవా?
వన్నెల పింఛ మున్న హరి
వల్లనెగా నుడివోవు తాపముల్!? 164

విష్ణుమూర్తి—

పాదాలను పలుమారు ఆశ్రయిస్తే గ్రుడ్డివారికైనా చూపురాకుండునా? (విష్ణుపాదం ఆకాశం. అదిశూన్యం. దాన్ని ఆధారంగా భగవదారాధనచేస్తే వారికి బాహ్యదృష్టి అనవసరం - అంతరదృష్టి లభిస్తుంది కనుక!) కన్నయ్యా! అని ముద్దుగా యశోదమ్మచేత పిలిపించుకొనే వాడిని శరణం పొందితే, ఆతని బుడిబుడి నడకల ఉత్సాహంతోనే కుంటివానికైన కాళ్ళు రాగలవు! వెన్నలుతినే మెత్తని మనసుగల స్వామి మొఱవింటే మూగవానికైన మాటలు రావలసిందే! చిత్ర వర్ణపు నెమలి పింఛాన్ని విసనకఱ్ఱలా శిరసున దాల్చిన హరి ఎలాంటి తాపాన్నైనా తీర్చడానికి సమర్థుడు!

గురునికి పుత్ర జీవముల
గోరగ దక్షిణ గాగ నిచ్చితే!?
కర మభిమన్యు పుత్రు నటు
కాచితె యస్త్ర దవాన లంబునన్ !
కరుణ కుచేల కూర్మి చెలి
కాని యకించన బాధ బాపితే!
కరి మకరంబు వాతబడ
కాతె తరింప శరణ్య తోషణా! 165

ఓ మహాత్మా!

శరణు పొందిన వారిని సంతోష పెట్టగల దీక్ష నీది! నీ గురువు సాందీపనికోరగా పుత్రుని, ప్రాణాలు తెచ్చి యిచ్చావు. అభిమన్యు పుత్రుని ఉత్తర గర్భంలో, అస్త్రాగ్ని పాలుగాకుండ కాపాడావు. చిన్ననాటి మిత్రుడు కుచేలుని దారిద్ర్యం నుంచి ఉద్ధరించావు! గజరాజు మొసలికి జిక్కగా రక్షించావు! కనుక నీవు శరణాగత వత్సలుడివి!

హరుడు విరించి దేవవిభు
  లాదిగ గల్గు ప్రశస్త దేవతల్
శరణము బొంది నీ కరుణ
  శాశ్వత శక్తులు బొంది నారలే!
పరమ కిరాత కంబులగు
  పాతకముల్ ఘొనరించి యైన నే
తిరమగు భక్తి మ్రొక్కలిడ
  తీర్పవె పాపము లంబు జాననా! 166

ఓ నీరజ వదనా!

శివుడూ, బ్రహ్మ, ఇంద్రుడూ మొదలైన దేవతోత్తములు నీ శరణుపొంది గొప్ప మహిమలూ, శక్తులూ సంపాదించుకొన్నారు గదా! నేను మునుపెన్ని పాపాలనుచేసి ఉన్నా మనసు మారి యిపుడు స్థిరభక్తితో మ్రొక్కుతున్నాను. కనుక నన్ను కనుకరించి కాపాడు!

కపిలలు రెండు నీ మధుర
గానము వించును, మోర లెత్తియుఁ
తపసుల వోలె దృష్టి నొక
తావున నిల్పెను కన్నుదోయినిఁ,
జపమును జేయుఁరీతి, సహ
జంబుగ నాడగ నోళ్లుమస్తముల్,
సఫలత గాంచె వేణురవ
సారమె! బోధము గాగ మాధవా! 167

మాధవా!

రెండు కపిల ధేనువులు నీ కమ్మని గానం వింటూ మోరలు పైకెత్తి, కంటిచూపు నిశ్చలంగా ఒక తావున నిల్పి, మునులవలె కన్పిస్తున్నవి నీ చెంత! అవి సహజంగా నెమరు వేతలో కదిపే నోళ్ళు పరిమితంగా కదులుతూ, ఊగే తలలు లయబద్ధంగా ఊగుతుండటంవల్ల ఏదో జపిస్తున్న మునులు వేణురవం విని, దానినే వేదాంత బోధగా స్వీకరించి తనివి చెందుతున్నట్టుగా చూపరులకు తోస్తున్నవి!

లోకము లంకు రింపగను
లోచన ముల్లల వెన్మిదొచు, దా
లోకము లాహరింప నొక
లోచనమే నలికంబు నందునఁ,
లోకము లుద్ధ రించుటకు
లోచన మొక్కటి మూర్ధ్ని పింఛమై
నీ కథ మూడు మూర్తులను
నేర్పుచు నున్నది నీలమోహనా। 168

నీల మోహనా!

సృష్టి కర్తవు నీవైనపుడు చతుర్ముఖాలలో ఎని మిది కన్నులు గలవాడివై, సృష్టిని లయం చేసే వేళ నొసటి కన్నొకటి చాలు ననగా ఉన్న వాడివై, లోకాలను కాపాడేందుకు ప్రశాంత మైన భావంతో అందాలొలికే కన్నొక దానిని శిరసు పింఛంలో నిక్షిప్తంచేసి, నీ త్రిమూర్తి త్వాన్ని లోకానికి బోధిస్తున్నట్టున్నావు!

సాగర శాయి! మేఘములు
సాగర మందున నుద్భవించిన
భోగ సరిత్తులై సతుల
ఖోలెను జేరును నందె, యట్లు నీ
రాగమునంది, వత్సలత
రంజిల సేవల జేసి, యెందరో!
నీ గళ మాలిక న్గలుగు
నిస్తుల పుష్పము లైరి చూడగా! 169

సాగరశాయీ!

సముద్రంనుండి పుట్టిన మేఘాలు మరల వర్షించి, నదులుగామారి, ఆ సాగరునికే ప్రియురాండ్ర వలె అందులోనికే వచ్చి చేరే విధంగా, నీ ప్రేమకు పాత్రురాండ్రైన ప్రేయసీ బృందమూ, నీ వత్సలతకు నోచుకొన్న భక్త సేవకులూ; ఎందరెందరో, నీవు ధరించే వనమాలలో తులలేని పూలుగామారి, నిరంతరం కళకళ లాడుతూ ఉన్నారని భావిస్తాను.

వలపుల వాన మబ్బొకటి
వల్లవ వీథుల వచ్చి జల్లుగాన్,
చిలిపి తనాల సందె సిరి
చిందులు వారెను పల్లె నప్పుడే!
కలికి మిటారి కొమ్మలకు
కాముని నాకము జేరు నిచ్చెనై
వెలసెను నింద్ర చాపమయి
వ్రేతల బిడ్డగ నాన వెన్నుడున్! 170

ప్రేమ రూపమైన——

వాన మబ్బొకటి వ్రేపల్లె మీదికివచ్చి జల్లుగా కురుస్తున్న సమయాన, కృష్ణుని చిలిపి తనాలనే సాయం సంధ్యా కాంతులు ఆ పల్లెమీద ప్రసరించడంవల్ల, ఆ పల్లెలోని సొగసు కత్తెలు మన్మథ స్వర్గానికి ఎక్కడానికై, ఆ గొల్ల పడుచుల మనస్సనే ఆకాశాన వెలసిన నిచ్చెనలా ఒక హరివిల్లు ఏర్పడింది!

నిన్ను జయింపగోరి తన
 'నిస్తుల యస్త్రము నిత్తు' 'నందుకై
కన్నయ! చక్ర మిమ్మ' నుచు
 కాంక్షను జేసిన ద్రోణ పుత్రునిన్,
తిన్నగ చక్రమెత్తు మని
 తేజము గోల్పడ వాడు లేపలే
కున్నను బోధ చేసితివి,
 ఓయి దయామయ! తన్మహత్వమున్. 171

ఓ దయామయా!

అహంకారియైన అశ్వత్థామ నీకు బ్రహ్మాస్త్రం ఇచ్చి, నీ చక్రాన్ని బదులుగా తీసుకోదలిచాడు. ఆ చక్రంతో నిన్ను జయింపవచ్చని ఆతని తలంపు? కాని నీ వందుకు సమ్మతించి చక్రాన్ని తీసుకు పొమ్మన్నప్పుడు తేలిక భావంతో మొదట ఎడమచేత, మరల కుడిచేత, మరల తన శక్తి నంతటినీ ఉపయోగించీ, దాన్ని కదిలింపలేక సిగ్గుజెందినపుడు - నీవా చక్ర మహిమను గూర్చి బోధించావట గదా! (రుక్మిణీ సహితుడై పండ్రెండేండ్లు బ్రహ్మచర్యంతో హిమవంతంలో తపస్సుచేసి పొందిన చక్రమది!)

కువలయ పీడనంబుఁ బడ
గూల్చిన కృష్ణుడు, రాముడుఁ గడుఁ,
ధవళము, రక్తసిక్త మగు
దంతము లూని భుజాల, కొల్వుకున్,
జవమున రాగ చూడరె! ప్ర
జల్, సభలోని విరోధి మిత్ర బాం
ధవజన సంఘముఁ దమకు
తాము గణించిన రీతి నాత్మలన్! 172

బలరామ కృష్ణులు—

కంసుని కొలువుకుపోతూ కంసునిచే నియోగింప బడ్డ మనుష్యులను చంపే కువలయ పీడనం అనే ఏనుగును చంపి, దాని దంతాలను చెరియొకటి లాగి తమ భుజాలమీాద నుంచుకొని - కొలువులో ప్రవేశించారు! రక్తసిక్తమైన ఆ దంతాలను వారలా ఆయుధాలవలె మూపున దాల్చి రావటం చూచిన సభలోని బంధువులూ, మిత్రులూ, శత్రువులూ - మొదలైన వారికి - తమ మనసులో ఆ సోదరులను గూర్చిన భావన ఎలాగున్నదో - అలాగే కనిపించారు!

మామ భయాన కంబుగను,
మల్లురు రౌద్ర రసాబ్ధి నట్లుగన్!
భామలు కాము నట్లుగను,
భక్తులు, యోగులు శాంత ముద్రగా,
భూమి పతుల్గనుం గొనిరి
పొంగుచు పైకొను వీర మట్లుగన్,
ప్రేమను, హాస్యముం గనిరి
పెంచిన వారలు, మిత్రు లయ్యెడన్,
ఆ మహనీయ సోదరులు
అద్భుత మూర్తులు! రామకృష్ణులున్! 173

అద్భుత మూర్తులైన—

ఆ రామకృష్ణ సోదరులు కంసునికి భయాన కంగా, చాణూర, ముష్టికులనే మల్లురకు రౌద్ర రసాకృతులుగా, స్త్రీలకు మన్మథాకారులుగా, భక్తులకూ, యోగీశ్వరులకూ శాంతముద్రలుగా, పరాక్రమవంతులైన రాజులకు పొంగివచ్చు వీర రసాబ్ధులుగా, దేవకీ వసుదేవులకూ, నందయశో దాదులకూ ప్రేమ స్వరూపులుగా, మిత్రులకు హాస్యరస స్ఫోరకులుగా, కనిపించారు!

స్వామి మనంబె నారదుడు !
సంతత మాతడు జేరి దైత్యులన్
కామిత మెట్లొ! నా విధిగ
కార్యము దీర్పగ బ్రోత్సహించెడున్,
సామము తోడ దేవతల
సన్నిధి జేరను, దీర్చు చిక్కులన్,
స్వామియె ప్రేరకుండు, గుణ
సంఘము పుట్టగ, వాని మాన్పగా! 174

ఆ గోపాలస్వామి—

ప్రాణులలో తానే ప్రేరణ కలిగిస్తూ, తత్ప్రే రణ మూలంగా జనించిన గుణాలను నాశనం చేయటానికి తానే కారణభూతుడౌతున్నాడు! ఆ పనిలో, ఆయన హృదయమే నారద మహర్షి రూపంలో లోక కల్యాణానికి కలహ భోజను డనే నిందను భరిస్తూ తిరుగుతుంది. అతడే (నారదుడే) రాక్షసులను ప్రోత్సహించేవాడూ, దేవతల చెంతకువచ్చి చిక్కులు తీర్చేవాడూను!

కలిత వికుంఠ మధ్యమున
కాంక్షను లక్ష్మియు, పుష్టి తుష్టులుఁ,
ఇలయు, సరస్వతీ సతియు,
నింపుగ విద్య యవిద్య, యూర్జయుఁ,
వెలయగ కాంతి, కీర్తియును,
విస్తృత శక్తియు, మాయ రూపముఁ,
చెలువగు శక్తు లిన్నియును
సేవలు జేయవె నీకు మాధవా! 175

మాధవా!

వైకుంఠంలో నీవు లక్ష్మి, పుష్టి, తుష్టి, ఇల, సరస్వతి, విద్య, అవిద్య, ఊర్జ, కాంతి, కీర్తి, శక్తి, మాయ, మొదలైన శక్తులు సేవిస్తుండగా కొలువు దీరి లోకపాలన చేస్తుంటావని తెలిసిన వారు చెబుతుంటారు గదా!

రాసము నందు నిన్నొడిసి
　　రామలు కంఠము, బాహు దండముల్
భాసుర లీల కౌగిళుల
　　బట్టుచు, వ్రాలుచు వ్రేలు చుండుటన్,
ఆరని కోర్కె నీవయిన
　　యంఘ్రుల వక్షము నందు నూనుటన్,
వారల నుద్ధవాది ఘన
　　భక్తులు భక్తిని గొల్తు మాధవా! 176

మాధవా!

రాసక్రీడలో, యమునా నదీమధ్య గత ద్వీపంలో నీతో కలిసి క్రీడించిన గోపికలు ఎంత ధన్యురాండ్రో! వారిని చూచి దేవతలు తరించడమే కాదు, ఉద్ధవాది భక్తులు సహితం ఉప్పొంగి, నిన్ను విడచి ఆ గోపికలకు చేతులెత్తి నమస్కరించారట! ఎందుకనగా, ఆ రాసంలో వారు నిన్ను పట్టుకోవడమే కాదు, కంఠానికి చుట్టుకొన్నారు! బాహు దండాలకు వ్రేలబడ్డారు! కౌగిలించారు! నీపై వ్రాలారు! వ్రేలారు! తాపంతో నీ పాదపద్మాలను తమ వక్షాలకు వత్తుకొని, నీలో లీనమైనారు! ఆ భాగ్యం అనన్యసామాన్యం. కనుక వారు వందనీయులైనారు.

కందురు సాంఖ్య యోగులు, ప్ర
కాశిత ధర్ముని విశ్వరూపుగా,
పొందుగ కర్మ యోగులకు
పూజ్యుట వౌదువు యజ్ఞ కాండలన్,
విందుగ జ్ఞాన యోగులకు
విద్య, తపో విభవాల పూజలన్
అందుము మాధవా! పరగ
నన్యులు నన్య విధాల గొల్వగా! 177

మాధవా!

సాంఖ్యయోగులు అంతర్యామివైన నీ సర్వేశ్వరత్వాన్ని, సర్వవ్యాపకత్వాన్నీ ధ్యానించి తరిస్తారు. అలాగే కర్మయోగులు యజ్ఞాదికర్మకాండలు నిర్వర్తించి నిన్ను పూజిస్తారు-ఋగ్యజుస్సామవేద ప్రతిపాదితమైన ఇంద్రాది దేవతల పేళ్ళమీదుగా! అట్లే జ్ఞానయోగులు లౌకికరాగ విరక్తులై, విద్యతో, తపస్సుతో నిన్ను పూజించి తెలుసుకొని ధన్యులౌతారు! ఇతరులు-అనగా వైష్ణవ దీక్షితులైతే పంచ రాత్రమును వాసుదేవ ప్రీతిగా, మహానారాయణారాధనతో, శైవులైతే పాశుపత, శైవమార్గాలలో నిన్ను కొలుస్తారు!

పావకు డౌను నీ ముఖము,

పృథ్వియు పాదము, సూర్య చక్షువై,

ద్రోవగ సత్య లోకమునె

పూని శిరంబుగ, మిన్ను నాభిగా,

చేవను జూపు బాహువులె

చెచ్చెర వాసవు డాది దేవతల్ !

ఈ వన వృక్షముల్ దనరు

నెంతయు రోమము లౌచు చూడగా,

జీవము వాయువౌ, నుదధి

చెన్నగు బొజ్జయి, మేఘముల్ శిఖై,

దేవ ! నఖంబు లస్తులును,

దిట్టపు పర్వత పంక్తులై జనున్,

నీవు నిమేషమున్ బరపి

నేర్తు దివంబును, రాత్రి, జేయగా,

పావన పుంస్త్వ చిహ్నమగు

బ్రహ్మము, వర్షము వీర్యమే యగున్ ॥ 178

మాధవా!

గుణాత్మకమైన ప్రకృతి నీ రూపమని చెప్పేవారు నిన్నావిధంగా వర్ణిస్తుంటారు! నీ ముఖం అగ్ని దేవుడనీ, పాదము భూమి, సూర్యుడు నేత్రమూ, సత్యలోకము శిరస్సూ, ఆకాశము నాభీ, బాహు దండాలు - ఇంద్రాది దేవతలూ, వృక్షాలు శరీర రోమాలూ, జీవము వాయువూ, సముద్రము ఉదరమూ, మేఘాలు తలవెంద్రుకలూ, పర్వత పంక్తులు గోళ్ళూ, ఎముకలూ; కాగా, కనురెప్పలల్లార్చి రాత్రిం బవళ్ళు సృష్టించి, బ్రహ్మదేవుని పురుష చిహ్నంగానూ, వర్షాన్ని వీర్యంగానూ, కలిగి, ఈ చరాచర సృష్టిరూపాన ఇంద్రియ గోచరుడ నౌతున్నావని!

జలచర కృత్యముల్, చెలగు
జాంతవ ధర్మము లొప్ప మత్స్యముఁ,
బలిమి వరాహమై మొదట
వర్ధిలి నాడవు తత్క్రియాదులఁ,
వెలయు ఋషీశ్వరాదులను
విజ్ఞత వామను డౌచు, మర్త్యులఁ
గలిసితి రామ రూపమున
కర్మలు లీలని దెల్ప మాధవా! 179

మాధవా!

ప్రాణులు చేసే కార్యకలాపాలు ఆయా ప్రాణి జన్మానికి తగిన రీతిలో నీ ప్రమేయంతోనే జరుగు తుంటాయని తెలుపడానికి – నీవు జలజంతువుల్లో చేపవై, అది ప్రవర్తించే విధంగానూ; భూజంతు వుల్లో వరాహానివై – తదుచిత మార్గంలోనూ– నీవు నిర్వర్తింపదగిన పనులు నిర్వర్తించావు! అట్లే, ఋషుల్లో వామనుడుగా పుట్టి, మానవు లలో శ్రీరామచంద్రుడివై జన్మించి, లోకా లకు ఆదర్శభూతుడవై నావు!

కన్నుల కింపుగూర్చు తిల
కంబును హారము లంబరంబులఁ
ఎన్ని విధాల నీ సొగసు
లెంతగ గూర్చిన నేమి యచ్యుతా!
అన్నిట నున్న పూర్ణునకు
నల్పులు నర్చల గూర్ప నెట్లగుఁ?
అన్నియు నాత్మ శోభకగు;
నందవు నద్దపు నీడ కట్లుగఁ! 180

మాధవా!

నిన్ను అలంకరించి తరించాలనే తపనతో భక్తులు నీకు తిలకం దిద్ది, పూలమాలికలు వేసి, ఎన్నో రీతులుగా సొగసులు కూర్చ జూస్తుంటారు! కాని, సకల చరాచర ప్రకృతిలో పూర్ణుడవై నిండివున్న నిన్ను అలంకరించడానికి ఏ వస్తువు తెచ్చినా అది అర్థంలేనిదే! ఎందుకనగా అది తన్ను తాను కొలిచినట్లవుతుంది. అజ్ఞానులు అలాచేసి తృప్తిపడుతుంటారుగాని ఆ యలంకారాదులు అద్దంలోని బింబానికి అంటని నిజాలంకారాలులా నీకు అంటవు గదా!

మూలము నీటితో దడుప
    మొక్కల శాఖలు, రెమ్మ లాకులుఁ,
శ్రీలు దలిర్ప పెంపుగను,
    ప్రీతిని నట్టులె సర్వ మూర్తియై
క్రాలెడు మాధవుం దనుప
    గానగు, దీనుల మంద భాగ్యులఁ
బోలిన రీతి నాదుకొని
    భూరి ఫలంబును బొందగా నగుఁ! 181

ఏ రీతిగా—

చెట్టు పాదును నీటితో నింపగా, అందులోని కొమ్మలూ, రెమ్మలూ, ఆకులూ, తమకు కావలసిన నీరాన్ని తీసుకొని కళకళలాడుతాయో, అలాగే - సర్వప్రాణి కోటిలోను నివసించే మాధవుని తృప్తిపరచడానికి దీనులనూ; దౌర్భాగ్యులనూ తోచిన రీతిగా ఆదుకొని, వారిలోని మాధవునికి సంతోషాన్ని కలిగించి తాముగోరే ముక్తి అనే గొప్ప ఫలితాన్ని పొందవచ్చు!

నిప్పును కఱ్ఱనుండి, కడు
నేర్పుగ ధేనువు దువ్వి దుగ్ధముఁ,
చొప్పడ దున్ని భూమి తిన
జూచెడు నన్నము, నట్లె త్రవ్వుటఁ
ఒప్పగ నీటి బొందునటు
లుర్విని భక్తులు కృష్ణు బొందరా!
తప్పని జ్ఞాన మార్గమున
తామయి వంచిన బుద్ధి దివ్వెగా! 182

భక్తులైనవారు—

శ్రీకృష్ణ పరమాత్ముని చేరుకోవడానికి కఱ్ఱను రాపిడిచేసి నిప్పును సాధించినట్లు ఓర్పుతోనూ; గోవును బుజ్జగించి దువ్వి, విరివిగా క్షీరాన్ని పొందే విధంగా నేర్పుతోనూ; భూమిని దున్ని పదునుచేసి పంటలు పండించి ఆహారాన్ని సంపాదించే తీరుగా ప్రయత్నంతోనూ; భూమిని త్రవ్వి నీటిని పొందినట్టు మిక్కిలి కష్టంతోనూ, జ్ఞానమార్గం విడువకుండగ, సాధనతో, బుద్ధిని తమ అధీనంలో ఉంచుకొని, వివేకమనే వెలుగును మార్గదర్శిగా చేసుకొంటారు!

అధరము లందు లోభమును
నత్యధి కంబగు ప్రీతి గూర్చుచున్.
మధురము లైన స్పర్శలను
మా, పశుమానస సిద్ధి గూర్చుచున్;
వ్యథగొని, భగ్న మైతనరు
భాతిని భ్రూకుటి కాలుడొప్పగా,
విధి నుదరంబునన్, గనుల
వేడుక కాలము గూర్తు వచ్యుతా! 183

అచ్యుతా!

నీవు క్రీపెదవిలో లోభాన్నీ, పై పెదవిలో ప్రీతినీ నింపుకొన్నావు! నీ స్పర్శలలో-పశుసహజమైన, మాకు పంతోష జనకమై, కోర్కెలు దీర్చగలిగిన గుణమున్నది! నీవు లోకాలలో కాలుష్యాన్ని చూచి బాధతో కనుబొమలు విరిచావనగా, అక్కడే కాలుడుద్భవించి లోకాలను లయం చేస్తున్నాడు! బ్రహ్మను నీ ఉదరాన నిల్పుకొని, కన్నులతో కాలాన్ని సృష్టిస్తున్నావు!

తనివిని జెంద కున్నవయి
 త్రాసము గూర్చెడు జూడ నింద్రియాల్
పెనిమిటి నొక్కనిఁ సతులు
 పెక్కురు బొందగ జూచు రీతినిఁ,
కనులు సురూపముఁ, చెవులు
 గానము, ఘ్రాణము మంచిగంధముల్,
పెనగు రసాలకై రసన,
 వీనిని బట్టగ నీవె మాధవా! 184

మాధవా!

నా ఇంద్రియాలు సంతృప్తిని జెందక నాకు భయాన్ని కలిగిస్తున్నాయి! ఒకే భర్తను అనేకుర స్త్రీలు పొందటానికి ప్రయత్నించినట్టు - నా కన్నులు సుందర రూపాల వెంట పరుగులు పెట్టగా, చెవులు మధురగానాలకోలకు పరుగులు గొనగా, నాసిక సుగంధాన్ని కాంక్షించగా, నాలుక రుచ్యమైక రసాల కుబలాట పడగా, వ్యథనందుతున్నాను. ఈ యింద్రియాలను నిగ్రహించడానికి నాకు నీవే దిక్కు!

ఎవ్వని వక్ష మందునను
　　నెప్పుడు నుండును లక్ష్మి శోభతో ?
ఎవ్వని నీడ బ్రహ్మమగు ?
　　ఎవ్వని మస్తక మౌను స్వర్గమున్ ?
ఎవ్వని స్తన్య జన్యమగు
　　నెంతయు ధర్మ, మధర్మ మన్యధా ;
ఎవ్వని స్వైరలీల గల
　　విన్ని జగాలును? నీవె మాధవా ! 185

మాధవా !

ఎవని వక్షస్థలాన లక్ష్మి ఎప్పుడూ నిలకడగా ఉంటుందో ఆతడూ; ఎవని నీడ బ్రహ్మమూ, ఎవని శిరస్సు స్వర్గమూ అనబడుతున్నదో ఆతడూ; ఎవని స్తన్యం నుండి ధర్మమూ, వీపు నుండి అధర్మమూ ఉద్భవిస్తున్నాయో ఆతడూ: ఎవని లీలా విలాసంతో లోకాలన్నీ వెలసి యున్నాయో – ఆతడూ; నీవే కదా ?!

వరముల నిచ్చు వాడవని
 వాంఛను జేయను నీకు సేవలన్,
పరమ విభూతి యున్నదని
 భక్తుల బిల్చెడు దేవు మెచ్చబోన్,
విరివిగ సేవ జేయగల
 వేడుక యుండుట జేతు సేవలన్,
చెరగని ప్రేమ బంధముల
 చేరగ గోరుదు నిన్ను మాధవా ! 186

మాధవా !

నీవు నాకు వరాలివ్వగలవనే ఆశతో నేను సేవ జేయబోను. అలా తన దగ్గరగల సంపదలేవో యివ్వజూపి సేవకులను ఆకర్షించేవాడు, అధికార దర్పంతో, అర్థబలంతో వెట్టి చాకిరి చేయించుకొనే సామాన్యమైన రాజులాంటి వాడు! అలాంటి దైవాన్ని నేను మెచ్చుకోను. కేవలం సేవజేయాలడే తపన, ప్రేమ, నన్ను పట్టి పల్లారుస్తున్నందువల్లనే నేను నీకు సేవ జేయదలుస్తున్నాను. వేరే ప్రతి ఫలమేదీ నాకు వద్దు!

నిన్ను గురించి నాస్తికులు
నేర్పుగ బ్రశ్నలు వేసి, యెక్కడో
తిన్నగ జూపు మందు రిల
దివ్వెను జూడని చీకు లట్లుగా,
మిన్నక నీదు భక్తియను
మిక్కిలి నీటను గుండ రీతిగా
నున్న నరుండు కృష్ణ! నిను
నొప్పుగ జూచును లోన, వెల్పలన్! 187

కృష్ణా!

నాస్తికులు - ఎదుటనే దీపమున్నా చూడలేని గ్రుడ్డివారిలా - తమ నేర్పు మాటలతో భగవంతు డెక్కడున్నాడు? ఉంటే యెక్కడ? అని ప్రశ్నిస్తుంటారు. వారికి అనుభవానికిరాని, చూడనిష్టపడని వానిని లోకంలోనే లేదని నిరూపించాలని వారి తపన! వారికి తెలియదు-జ్ఞానమార్గంలో కాకపోయినా కేవలం భక్తి మార్గంతో నీ వునికిని తెలియవచ్చని! నీ భక్తి అనే మిక్కిలి నీటిలో చిన్న కుండలా మునిగి పోయి మానవుడు తనలోపలా, వెలుపలా నిన్నే చూడగలడు గదా!

దేహము పెంచు మోహముల
దివ్య పథంబుల కడ్డు గోడగా,
దేహము పెంచు వాసనల
ధీరుల దీనుల జేయు రీతిగా,
దేహము గూర్చు తాపముల
తీయని కోర్కెలు దీర కుంటచే,
దేహము పైని మక్కువను
దేనికి పెంతురో! పృథ్వి మాధవా! 188

మాధవా!

ఈ దేహం మోహాలను పుట్టించి మానవుడు దివ్య పథాన్ని అందుకోవడానికి అడ్డుగోడగా నిలుస్తున్నది. ఈ దేహమే కోర్కెలను రేకెత్తించి ధీరులైన వారినిగూడ ఔన్నత్యం కోల్పోయి దీనులయ్యేటట్లు చేస్తున్నది! ఈ దేహం తనకు గల్గిన తీయని కోర్కెలు తీరకపోతే తాపంతో దహించుకుపోతూ మనిషికి వేదనను కలిగిస్తున్నది! ఇలాంటి దేహంమీద మానవులెందుకు మమకారం పెంచుకొంటారో గదా?!

నీపద పంకజంబులను
నిండె మరంద కణాల వాయువుల్,
ఆ పవనంబు వెల్వడుచు
నచ్యుత! భక్తుల గాన రూపమై
తీపిని దన్పె మాచెవుల
ద్రిప్పెను మామది తత్త్వ గామిగా,
ఓ పరమాత్మ! నీ కథల
నొప్పుగ వింటయు గొప్ప పుణ్యమౌ! 189

అచ్యుతా!

నీపాద పద్మాలలోని మకరంద కణాలతో గూడిన వాయువు భక్తుల గాన రూపంగా వెలువడి, తత్త్వజ్ఞానంనుండి దారి తప్పిన మావంటి వారి చెవులకు తీయగా సోకి, మరల నిన్ను స్మరించే టట్లు చేస్తున్నవి! కనుక నీ కథా శ్రవణమనేది గూడ గొప్ప పుణ్యాత్ములకే లభిస్తుంది సుమా! (శబ్దం వాయువు ద్వారావచ్చి మన చెవులను తాకుతుంది. ఆ వాయువు స్వామి పాదపద్మాల లోని మకరంద కణాలతో కూడి ఉన్నందువల్ల వినిపించే శబ్దాలు తీయగా చెవికి సోకి, విందును గూరుస్తాయి!)

నరకము నందు గూడ గన
నాక సుఖాలవి యున్నవం(డు, నీ
ధర నవివేకు లెప్పుడును
తామస చింతల నైహి కేచ్ఛలఁ
వరములు గాగ గోరెదరు
వారివలెన్ నిను గోర నెప్పుడుఁ,
వరముల నిచ్చు దేవతల
పాలి వరంబగు దేవ! బ్రోవవే! 190

ఓ దేవదేవా!

నీవు దేవతలకుగూడ వరాలిచ్చేవాడవు. తామసులైన అవివేకులు, ఈ లోకులు, విషయ సుఖాలను తమకు వరాలుగా ఇమ్మని నిన్ను కోరుతారు. ఆ సుఖాలకొరకు నిన్నే వేడ పనిలేదు. ఎన్ని పాపాలుజేసి నరకానికిపోయినా, ఆ నరకంలోగూడ కొన్ని సుఖాలు లభిస్తాయని వింటున్నాము. కనుక, నేనవి కోరక నన్ను కేవలం తప్పుడు మార్గంలో పోకుండ కాపాడ గోరుతాను.

సృష్టియు పాలనా లయము
   లెంతయు సాగును ప్రేమ చేతనే,
స్పష్టము పక్షులజ్ఞ పసుల
   సాగెడి సంతతి ప్రేమ చేతనే,
కష్టము నష్టముల్ మరచి
   కాలము పుచ్చుట ప్రేమ లబ్ధిచే।
ఇష్టసఖా! యశోదసుత!
   పృథ్విని నింపిన ప్రేమ నిమ్మురా! 191

'ఓయీ ప్రియసఖా!

యశోద బాలకా! ఈ సృష్టి, స్థితి, లయాలనే కార్యాలన్నిటినీ ప్రేమతోనే నీవు సాగిస్తున్నావు. పశుపక్ష్యాదులలో కూడ ప్రేమ తత్త్వం పాదుకొల్పినావు కనుక నే-వాటి మధ్యకూడ ప్రేమానురాగాలూ, సంతతి అభివృద్ధీ సాగుతున్నది. లోకంలో ఆ ప్రేమ అనే పదార్థం పరిపూర్ణంగా లభిస్తున్నందుచేత నే జీవులు కష్టనష్టాలు మరచి మనగలుగుతున్నారు. కనుక-ఈ విశాల విశ్వమంతా నీవు నింపిన ప్రేమను నాకు ప్రసాదించి ధన్యరాలినిగా జేయి-' అంటున్నదొక గోపిక!

సేవకు నాజ్ఞయిమ్ము! సిరి
చెంతనె సేవల నేను జేయగా,
సేవకు లైన భక్తుల వి
శేషముగా దయజూచి, యామెకుఁ
ఏ విధమైన కోపమును
నింతయు దేరకు స్వామి! నిత్య భో
గావహుం డీవదేమొ! నను
నామె సపత్నిగ నెంచ నేమగుఁ! 192

స్వామీ!

నీవు నాకు లక్ష్మితో పాటు నీ సేవ జేయటానికి అనుమతి నివ్వు. నీవు భక్త పక్షపాతివి గనుక భక్తులను విశేష దయా సముద్రంలో తేలియాడిస్తూ, ఆమెను నిరాదరిస్తావని లక్ష్మీదేవికి కోపం రావచ్చు. నీవు నిత్యభోగివి కనుక ఆమెవున్నా, లేకున్నా లెక్కలేదు. కాని, నాకు మాత్రం ఆమెతో సాపత్న్య విరోధంవద్దు సుమా!

వలదయ నాకు ముక్తి! కడు
భక్త హృదంతర జన్యమౌచు, నా
వల భవదంఘ్రి పద్మ మధు
వాగ్ఝరి రూపకథల్ నిరంతరం
బలవడ వింటకే వలతు
నబ్బురమౌ చెవు లొక్కకోటి! నా
కలవడు నెట్లు? మోక్షమున
నట్టి కథాశ్రవణంబు మాధవా! 193

మాధవా!

నాకు మోక్షమక్కరలేదు. భక్త హృదయం నుండి నిర్గమించి, నోటి (స్తుతుల) ద్వారా ప్రవహించే నీ పాద పద్మాలలోని మకరందామృత కథా చిత్రాలను ఎల్లప్పుడూ వినటానికి నాకు కోటి చెవులు ప్రసాదిస్తే చాలు! మోక్షంలో నాకీ యదృష్టం లభించదు కనుక నాకదివద్దు!

వద్దుర కృష్ణ ! మోక్ష మది
వ్యర్థము నిన్నొక సారి గూడకన్,
ఒద్దిక నిన్ను గూడుటయె
యుత్తమ మైనటువంటి ముక్తిగాన్
ఇద్దర నిన్ను వీడి నరు
లేల తపాలను జేతు రందుకై,
ముద్దుల గోపబాల నిను
ముద్దుల దన్పెడి మోక్ష మివ్వరా। 194

కృష్ణా!

నిన్ని జన్మలో ఒక్కసారైనా కలుసుకోకుండా నాకు మోక్షంవద్దు. నిన్ను కూడటమే ఉత్తమోత్తమమైన మోక్షం కదా! నీవీ ఇలపై అవతరించి అందరికీ ఆగుపిస్తుండగా ఈ మానవులు కొందరు ముక్తికోసం, మరెవ్వరిని గూర్చో తపస్సులు చేస్తున్నారు! నేను మాత్రం నిన్ను కలిసి, నీకు ముద్దులిచ్చి సంతృప్తిని కలిగించిన (సా మీా ప్య) మోక్షమందుకొనే భాగ్యం కలిగించు!

ఇష్టము స్పష్టమౌ నటుల
నింపుగ జేసెడి చేత ముద్దగుణా!
ఇష్టుల మేలు, సౌఖ్యముల
నెప్పుడు గోరెడి గుర్తు ముద్దగుణా!
సృష్టిని భాషరానివి, ని
కృష్టపు జీవుల భాష ముద్దగుణా!
ఇష్ట మదెంతో దెల్పగను
నిత్తుర ముద్దను కృష్ణ! యేలుకో! 195

ఓ కృష్ణా!

లోకంలో ప్రాణులు తమ మనసులో మరొక ప్రాణిపై గల యిష్టాన్ని స్పష్టంగా, ఎంతగాఢంగా ఉన్నదో తెలుపుతూ చేసే ఒకానొక చేష్టి తాన్ని 'ముద్దు' అంటారు. తమకు ఇష్టమైన వారి మేలునూ, సౌభాగ్యాన్ని వాంఛిస్తూ చేసే చేతను గూడ 'ముద్దు' అంటారు! ఈ సృష్టిలో భాషరాని అల్పప్రాణులు కూడ తమ యిష్టా యిష్టాలను ముద్దుల భాషలోనే తెలియజేసు కొంటాయి. ఆ ముద్దు తెలిపే అర్థం భాషకు అందనిది! కనుక నాకు నీ మీదగల యిష్ట మెంతో నేను భాషలో చెప్పలేను. అందుకే నా ప్రేమాధిక్యాన్ని ముద్దు రూపాన తెల్పు కొంటాను. నన్నేలుకో! - అంటున్నది గోపిక.

పురుషుడ వీవొకండ విల
 పొల్పుగ నీసరి లేరుకావునన్
గరువ తనంబుమాని తన
 కార్యము లన్నిట కర్త వీవుగా,
విరచిత నమ్ర వర్తనము
 విశ్వ నుతంబుగ బెంచు టొప్పగున్,
పరుషము మాని భూజనుల
 ప్రస్తుతి కెక్కుట చాల మెప్పగున్ ॥ 196

స్వామీ!

ఈ లోకంలో అహంకారులు తాము చేసిన ఘన కార్యాలన్నిటికీ తామే కర్తలమనీ, తమ పౌరుషమూ, శక్తి సామర్థ్యాలవల్లనే అవి నెరవేరాయనీ చెప్పుకొని విఱ్ఱవీగుతుంటారు. నిజానికి నీవొకడివే పురుషుడివి! తతిమా ప్రాణులన్నీ ప్రకృతి రూపమై (స్త్రీత్వానికి చిహ్నంగా) నీ యిచ్ఛాధీనమైన గుణాలకు పుట్టుక స్థానంగా ఉండటంవల్ల – ఏ ప్రాణి చేసిన పనికీ కర్తృత్వం రాదు. అది తెలిసి మానవులు తాము చేసే పనులన్నింటికీ కర్తవు నీవుగా నమ్మి, వినయం పెంచుకొని, తమ ప్రవర్తన సరిదిద్దుకొని, లోకుల మెప్పుబొందటం మంచిది.

తలచిన చాలు నీ కురుల
దాల్చిన పింఛము దేల్చు పుల్కలన్,
వలచిన చాలు నిన్నుమది
వచ్చును యౌవన వార్ధి పొంగుచున్,
పిలచిన చాలు 'గోపి !' యని
పెల్లుబుకున్ మదిలోని కోర్కెలే !
నిలచిన చాలు నీ యెదుట
నిండును కోర్కెలు! పండుభాగ్యముల్! 197

గోపాలా !

నీ తలపులు మాలో ఎన్నో ప్రేరణలను కలిగిస్తున్నవి! నీ చిన్ని కూకటి జుట్టుమీద చెలువు మీర ధరించిన నెమలి పింఛాన్ని తలుచుకోగానే మా శరీరం పులకరిస్తుంది! నిన్ను ప్రేమించాము గదా! అనే భావం కలుగగానే మాలోని యౌవనం సముద్రంలా పొంగి పొరలుతుంది! నిన్ను 'గోపీ!' అనే మధురమైన రెండక్షరాలతో పిలవడం వినగానే మనసులో దాగిన కోర్కెలు పెల్లుబికి వస్తాయి! ఒక్కసారి నిన్ను చూచి, నీ యెదుట నిలబడితే చాలు కోర్కెలన్నీ తీరి, సకల సౌభాగ్యాలూ సిద్ధిస్తాయి!

గోపిక లంత రంగమున
గోప కిశోరుడు జొచ్చెనంచు, నా
గోప కులాధికుఁ దలచు
కోటి విధంబుల దూఱు నేటికో!
ఏపగిదిఁ ఘటంబునను
నెవ్వరు జొన్పరొ యాకసంబు, నా
రూపున మాధవుండు స్థిర
రూపము నన్మను ప్రాణి కోటిలో! 198

ఈ గోపికలు—

అమాయికలు గనుక 'ఈ గోపబాలుడు మా మనసులోనికి ప్రవేశించి వేధిస్తున్నాడే!' అని పలురీతుల నిందిస్తుంటారు. నిజానికి అతడు వారి మనసులోనికి ప్రవేశించిందెపుడు! కుండను చేసినప్పుడే దానిలోపల ఆకాశం ఉన్నదిగానీ, ప్రత్యేకించి ఆకాశాన్ని పట్టి ఎవ్వరూ కుండలోనికి ప్రవేశ పెట్టలేదు. అలాగే, ఈ మాధవుడు సర్వప్రాణికోటిలోను స్థిరరూపుడై నెలకొనివున్నాడుగానీ, మనసు లోపలికి క్రొత్తగా పోయిన దెప్పుడు?

కోమల రూపము గనుచు
　　కోమలి యొక్కతె పాడ మోహనఁ,
మోమున వెన్నెల లనుచు
　　ముగ్ధయు నెత్తెను చక్రవాకముఁ,
శ్యామల దేహకాంతి గని
　　సారస నేత్ర యు మేఘరంజనిన్,
తామర పాదము లనిన
　　తన్వి యొకర్తుక హంసనందినిఁ,
కాముని కన్న తండ్రివని
　　కామిని యొక్కతె కామవర్ధనిఁ,
ఆమని శోభ నిన్నుగని
　　యంగన బాడె వసంత రాగముఁ,
నీ మద బాహు దండముల
　　నేరిమి జిక్కమి సింధుభైరవిఁ,
నీ మరు లోర్వరాని సతి
　　నెమ్మది బాడుచు కీరవాణినిఁ,
కోమలు లిట్లు నీకొఱకు
　　గూర్చిరి వేయగ రాగ మాలికఁ
ప్రేమను మాధవా! తరలు
　　పెండ్లికుమారుడ వౌచు బృందకుఁ॥ 199

మాధవా!

నీ కోమల రూపాన్ని చూచిన కోమలి యొకతె మోహనరాగాన్నీ, నీ ముఖ చంద్రికలను చూచిన వనిత చక్రవాకాన్నీ, నీ నల్లని దేహ కాంతిని చూచినావిడ మేఘ రంజనినీ, నీపద్మాల వంటి పాదాలను గాంచిన పడతి హంసానందినీ, నీవు కాముని గన్నవాడవని యొకతె 'కామ వర్ధని' నీ, నీలో వసంత శోభను జూచిన నెచ్చెలి వసంత రాగాన్నీ, నీ బాహుదండాలలో చిక్క బడనందుకు విచారించే వనిత సింధు భైరవినీ, నీ మరులోర్వరాని మగువ కీరవాణినీ, పాడ నారంభించారు. ఇలా వారాలపించిన రాగాలు వరుసగా నొక రాగ-మాలికగాకూర్చి, నీ మెడలో వేయడానికి బృందావనిలో సిద్ధంగా ఉన్నారు. కనుక నీవిక పెండ్లికొడుకై బృందావనికి వచ్చి వారి కోరిక దీర్చు...!

మోమును చూడనా? పెదవి
మోహము గూర్చును మానసంబునన్!
నామము చూడనా? పొడము
నాదు మనంబున కామనల్ కడున్!
ప్రేమను కందునా పదము?
వేడుకమై హృది జేయు నర్తనల్!
వేమరు విందునా మురళి?
వీనుల కింకొక శబ్ద మానునే! 200

మాధవా!

నిన్ను చూచినప్పుడు నీలోని ఒక్కొక్క అంశమూ నన్నేవో కోర్కెలకు లోనుజేసి, ఏవేవో అనుభూతులు కలిగిస్తాయి! నీ ముఖం చూచినప్పుడు వెంటనే నీ అధరాలు ఆకర్షిస్తాయి! మనసులో మోహాల్ని గుబులు కొలుపుతాయి. మరల నిన్ను పట్టి చూడమనిపించేది నీ నొసటి తిరునామము! దానిని చూడగానే నాలో ఎన్నెన్నో కోర్కెలు చెలరేగుతాయి! తరువాత నీ పాదాలను ప్రేమతో చూచేటప్పటికి, నా హృదయం నాట్యం చేయ నారంభిస్తుంది. నీ మురళీరవం వింటాననుకో! నా యీ చెవులకు మరే శబ్దమూ వినిపించదు!

కరుణా సాగర! పద్మనాభ! భువిపై
గాండీవికన్ సాకుతో,
నరజాతిన్ సురసీమ జేర్పదగు, నా
నాధర్మ సంక్షిప్త మౌ
వర సూక్తుల్ వచియించి, గీతయని, శ్రో
వల్లప్పు మాహాత్మ్యలన్,
సరియౌ దారుల ద్రొక్క జేయుదువె!—ఘో
షావాస! గోపాలకా! 201

దయా మయుడవగు—

ఓ పద్మనాభా! గొల్లపల్లె నివాసివైన గోపాలకా! అర్జునునికి బోధించే నెపంతో, మానవులను మోక్షగాములనుగా చేయగలిగిన ఉత్తమోత్తమ ధర్మాలను గీత రూపంలో బోధించి, ధర్మపతితు లౌతున్న మానవులను సన్మార్గవర్తులనుగా జేస్తున్నావు గదా!

నీ చిరునవ్వు జూచినను
నిక్కము దోచును మోహినీ స్మృతుల్,
నీ చరియించు ఠీవిగని
నేను దలంతు నృసింహుడైన నిన్ !
నీ చతురంపు వాక్మితను
నేను వినంగల వామ నాఖ్యునిన్ !
నీ చెలువంపు పోకడలు
నేటివి గావుర చూడ మోహనా! 202

మోహనా!

నీ చిరునవ్వు జూచినపుడు మోహినీ అవతారము గుర్తుకు వస్తున్నది. ఠీవిగా నడుస్తున్నపుడు నీవు నృసింహుడవైన వైనం జ్ఞాపకం వస్తున్నది. నీవు నేర్పుగా మాటలాడుతున్న తీరు, నీ వామనావతారాన్ని తలపిస్తున్నది! నీ విశ్వమోహనమైన చిత్రపు నడకలు ఈ యవతారానికి మాత్రం పరిమితమైనవి కావు. పూర్వావతారాలలో సైతం ఉన్నవి సుమా!

నడకలు తీపి, నీ మధుర
    నామము తీపి, యశోద మెప్పుకై
నుడువులు రానివాని గతి
    నోటను బల్కెడి మాటతీపి! నీ
తొడవులు తీపి, కంఠమున
    దూగెడి యా వనమాల తీపిరా!
కడువడి పర్వు లెత్తుటను
    కాంచి కటిన్ దిగజార తీపిరా! 203

ఓ బాల గోపాలా!

నీవొక మధురాకృతివి! నీ రూపూ, తలపూ, చేష్టలూ, సర్వస్వమూ మధురమైనవి! ఒక్కటొకటిగా చెప్పడమెలా? నీ నడకలు తీయనివి. నీ పేరు అంతకంటే చవులూరేది! యశోదకు సంతోషాన్ని కలిగించడానికి నీవు నోరు తిరగనివానిలా ముద్దుముద్దుగా పలికే పలుకులు ఎంతో మురిపెం గూర్చుతాయి! నీవు ధరించే వస్త్రాలూ, నీ కంఠంలో వ్రేలాడే ఆవనమాలా, ఎంతో మధురమైనవి! తుదకు నీవు పరుగులెత్తేటప్పుడు నీ మొలనూలు క్రిందికి జారిపోతుంటే, అది కూడ చూడటానికి మా కెంతో ప్రియంగా వుంటుంది సుమా!

వాసిగ గోచితో, మొలను
వంశియు తాయెతు లొప్పు కాంచితో,
మాసిన మేనితో, జగము
మత్తిలు సే చిరునవ్వు మోముతో,
రాసము చేయుచోట, ప్రియ
రాధను గూడి రసించు రూపుతో,
నీసిరి చూడ వేడితిని
నీరజ నేత్ర! యశోద బాలకా! 204

నీరజ నేత్రా!

యశోద బాలకా! నీవు చిన్న గోచీ పెట్టుకుని, మొలనూలిలో తాయెతులు కట్టుకొని, అందులో మురళిని చెక్కుకొని, శరీరమంతా దుమ్ము కొట్టుకొని, లోకం పరవశించే చిరునవ్వులు చిందిస్తూ కనిపించే ముఖంతో నిన్ను చూడ గోరుతున్నాను. అంతేగాదు. రాధను కలిసి రాసక్రీడ లాడేటప్పుడు నీ సొగసులెలా ఉండేవో కూడ చూడగోరుతున్నాను.

మాటలు పాటలై యమరె
　　మాధురి చిందు మరంద లాహిరిన్!
ఊటలు పుట్టె భావములు
　　నొద్దిక గూడెను పద్య పుష్పముల్ !
తేట తెనుంగు తోటగల
　　తేటులు కర్ణ రసాయనంబుగా
పాటలు పాడి నీ చరిత
　　ప్రస్తుతి జేసిన రీతి మాధవా! 205

మాధవా!

తేట తెనుగు తోటలోని తేటులు శ్రావ్యంగా నీ పాటలు స్తుతుల రూపంగా పాడి వేడుక గొల్పు రీతిగా, ఈ గ్రంథంలో ఏవో మాటలు పాటలుగా మారాయి! అవి నీ గురించి కనుక తీయగా మకరంద లాహిరిని గూర్చగలవు. నిన్ను తలచుకోవడం వల్ల ఏవో భావాలు ఊటలు పుట్టి పద్యాలుగా కుసుమించాయి! అంతే!

విన్నవి కొన్ని, నేఁజదివి
   వేడుక భావన చేసికొన్ని, యే
తెన్నున భక్తకోటి విను
   తించెనొ నావిధి కొన్ని, నేనుగా
కన్నులు మూసి నీ చెలువు
   గన్న విధంబులు కొన్ని యున్న వీ
చిన్ని తెనుంగు కబ్బమున
   చేకొని మాధవ! చేర్చు నీదరిన్‌। 206

మాధవా!

ఈ చిన్న తెనుగు కావ్యంలో నిన్ను గూర్చి విన్నవి కొన్ని, చదివినవి కొన్ని, భావించినవి కొన్ని, పూర్వము భక్తులు సాంప్రదాయకంగా వినుతించిన విధానాలు కొన్ని, నేనుగా కన్నులు మూసికొని నిన్ను భావించి ఊహించు కొన్న తీరులూ, చూచిన యందచందాలూ కొన్ని – ఉన్నవి! ఇవి నీవు స్వీకరించి నన్ను ఆదరించు!

శుభమ్!





'మురళీమాధవం' అనే పద బంధమే కమ్మని ఊహలకు ఊపిరి లూదు తున్నది! ఇందులో కవి తానే మురళిగామారి మాధవుని అంతరంగ భావ తరంగాలన్నీ సొంతం చేసుకొని, పలుపోకడల్లో సుస్వరాలు వినిపించారనుకొంటాను. స్వాధీన పతికయై, ఆ మురళిమాధవుని నియంత్రించినట్లే, పాఠకులనుగూడ స్వర మంత్రాలతో కట్టివేసి, కామధేనువులా పాటల పచ్చిపాలనిచ్చి తన్పగలదు!

ఆధునికులు వచన, గేయ రచనలతో మృదుపద బంధురంగా కవితను పాఠకుల దగ్గరికి తెస్తున్నారు. కానీ, ఛందోబద్ధంగా కవిత చెబుతూ, ఇంత సారళ్యాన్ని సాధించి, పాటల్లాంటి పద్యాలను శ్రీ భాస్కర్‌లాగా చెబుతున్నవారు చాలా అరుదుగా కనిపిస్తారు ఇందులో కరుణశ్రీ లాలిత్యమూ, లతగారి మోహన వంశిలోని భావుకతా సమ్మిళితంచేసి, శ్రీ కృష్ణ కథను సుందర శిల్పాలుగా కవి మలిచి చూపించారని అనిపించింది. ఎన్నో పురాణాలూ, ఎన్నో గ్రంథాలూ చదివిన అనుభూతి! శ్రీ కృష్ణకథకు సంబంధించి ఎన్నో అద్భుతాశ్చర్య జనకాలైన సంఘటనలీ ఒక్క గ్రంథ పఠనంతో!

మధుర భక్తిని పారిజాత సుగంధ సమీరాలతో, వెన్నెల చెలువులతో, నవ్వుల పువ్వులతో, వానముబ్బులాంటి వన్నెకాని చూపులతో చూపుల తీవెలు కలసి మెలిబడ్డ ఊయెలలూ, అందులో ఊగేవలపు వేల్పుజంట విహారాలూ, ఇంకా ఎన్నో ఊహల గారడీలతో, మృదుపదాల జోడింపుతో, పాఠకులకు పంచుతారు కవి ఇందులో! భక్తి పారవశ్యంలో కూడా కవి తాను వేసుకొన్న ప్రశ్నల్లో ఎంతటి చిక్కు కనిపిస్తున్నదో, చెప్పుకొన్న సమాధానాల్లో అంతటి గడుసుదనం కనిపించి, ఔరా! అనిపిస్తుంది.

భాస్కర్‌గారికి మనోజ్ఞంగా ఊహించగల రసమయ హృదయముంది. తన ఊహలను కమ్మని కవితలుగా మార్చగల నేర్పూ, పాండిత్యమూ ఉన్నాయి. ఛందస్సుకే అలంకారాలు దిద్దుతూ, మధుర భక్తిలో అద్దుతూ మురళీమాధవాన్ని అందిస్తున్న ఈ కవి అభినందనీయుడు!

(డా॥) కె. యస్. ఇందిరాదేవి.

